# ఇంద్రాణి

( ఐతిహాసిక నవల )



పాటిబండ మాధవశర్మ, ఎం. ఏ. (ఆనర్సు)
న్యూ సైన్సు కళాశాల, హైదరాబాదు.



నాగేంద్ర బుక్ డిపో, సికింద్రాబాదు.

# మనవి

పౌరాణిక చారిత్రకాంశములు సమ్మిళితములై ఈ గ్రంథము రూపొందినది. తద్జ్ఞులు దీనిని నవల యందురో, ఏమందురో, నేను మాత్రము దీనిని ఐతిహాసిక నవల యందును.

దీని రచనయం దుపకరించిన గ్రంథములు :

1. కళింగదేశ చరిత్ర

సంపాదకులు : శ్రీ రాళ్ళభండి సుబ్బారావుగారు.

2. **Early Dynasties of Andhra Desa**
**by Bhavaraju Venkata Krishna Rao Garu.**

**20-6-58** రచయిత

మాఘబహుళ చతుర్దశి. తీయని కలలు గిలిగింతలు గొలుప నిదురముంపున నొయ్యారముగ నొడలు విఱిచికొను శబరసుందరివలె వంశధారాస్రవంతి యొడ్డులసందున నొదిగి యొదిగి త్రిభంగీభంగాకృతియై ప్రవహించుచుండెను. తెరలు తెరలుగఁ దేలివచ్చుచున్న ఇప్పపూల తెట్టలు నిగనిగలాడు నల్ల రాగుట్టలఁ దట్టుకొని చిళ్ళులై సుళ్లు తిరిగి శబర రమణీవక్షోమండల మండనములగు పగడాల పేరులఁ బురుడించుచుండెను.

మధుకవృక్షమూలమునఁ జేరఁబడియున్న యువరాజు అనిమిషలోచనముల నాయందమును గ్రోలుచుఁ దన్నుఁదా మఱచియుండెను. తానచ్చటికి వచ్చి యెంతసేపైనదో తనకే తెలియదు. నాలుక పిడుచగట్టుకొనిపోవుచుండ గ్రుక్కెఁడు నీరను దొరకినఁ జాలునని కాళ్లీడ్చుకొనుచుఁ గొనయూపిరితో నతఁడు నదీతీరము చేరుకొనెను. చల్లని నీటిగాలి సోఁకినంత మేనికెల్లఁ బ్రాణములు వచ్చినట్లయి యామధుకవృక్షమూలమునఁ గూలఁబడెను. ఇంద్రనీలవర్ణములీను వింతచేప యేదియో కొంతసేపు నదీమధ్యభాగమున, మఱికొంతసేపు అవ్వలియొడ్డు చేరువగా వంశధారాస్ఫటిక నిర్మల ప్రవాహమున నీఁదులాడుచుండెను. యువరాజు ఇంతసేపును ఱేయికన్నులతో నా వింతవస్తువును

తెప్ప వాగ్ల్పక తిలకించుచుండెను. అది ఎన్నో సారులు తనవైపు వచ్చుచున్నట్లుండెను. వచ్చి వచ్చి యంతలో మాయమై మఱలి యవ్వలితీరమునఁ దేలుచుండెను. క్రమముగా పొద్దువాటారు చుండెను. వంశధారానది గోదుమవన్నె త్రాఁచువలె జర జర ప్రాకిపోవుచుండెను. యువరాజునకు మఱపుమడతలలో నడఁగి యున్న దాహము స్మరణకు వచ్చెను. ఆయన మెల్లఁగా లేచి నీటిదరికిఁ బోయెను. వంశధారాజలములు ముదురు గోదుమ రంగు తిరిగి ఇప్పసారాయమువలె నుండెను. యువరాజు రెండు దోసిళ్లు త్రావి మూఁడవ దోసిలి పెదవులఁ జేర్చుచుండెను. అవ్వలితీరమునఁ గిలకిలమని కోయిల పలికినట్లయ్యెను. యువ రాజు నొడలు పులకించెను. తానింతసేపుగాఁ దిలకించుచుండిన నీలాలమీను నీటిలోఁ గానరాలేదు. అవ్వలితీరమున జీలుగు కొమ్మపై నూఁగుచుఁ గిలకిలమనుచున్న కోయిల యదియే కావలె. ఆమె చెంగున నేలపై దూకి చిఱుతపులి తోలు నడు మునకుఁ జుట్టుకొని కిల కిల నవ్వుకొనుచు మధుకవృక్షముల మాటున మాయమైపోయెను.

విస్మయావిష్టుఁడైన యువరాజు వట్టిదోసిలియే త్రావు చుండెను. అతని శరీరమున మాటిమాటికి రోమాంచము లంకు రించుచుండెను. ఆయనకుఁ దెలియకుండఁగనే పెదవులు విరిసి మందహాసముఁ జేసెను. ఆయన కన్నులవ్వలితీరమునే చూచు చుండెను. ఒక ఇప్పపూలతెప్ప ఆయన చరణముల నొరసికొని

పోయెను. ఆయన కొడలు తెలిసి తనలోఁదాను నవ్వుకొనెను. ఈ కష్టములలోఁ దనకు నవ్వేమిటి? తడిచేతులతోఁ గన్నులు తుడుచుకొనుచు యువరాజు మఱల ఒడ్డెక్కి మధుకవృక్ష మూలమునఁ గూలఁబడెను. విరియఁబూచిన ఇప్పచెట్లు బంగరు పూలు గురియుచున్నట్లుండెను. సంధ్యాతప తపనీయకాంతులు వంశధారానదిపైఁ బ్రసరించి శిశిరకాలపుఁ జిఱుచలికిశబరరాజ కుమారి యొడలినిండ జిలుగుబంగరు దుప్పటులువఁ గప్పికొన్న ట్లుండెను.

చిఱుగాలి తరఁగలసోఁకున యువరాజు ఒడలు ముడుచు కొనఁబోయెను. ఒడలెల్ల పులిసినట్లుండెను. ఆయన యొడలు తడవిచూచుకొనెను. అన్నియు గాయములే. ఎచ్చట తాఁకి నను భగ్గుమనుచుండెను. శరీరమెల్ల సలసల మరఁగి పోవుచుం డెను. కంచుకము గాయముల కంటుకొనిపోయి యెటు కదలి నను చుఱుకుచుఱుక్కు మనుచుండెను. ఇన్ని గాయములు తన కెప్పుడు తగిలినవి? తనకుఁ దెలియనే తెలియదు. నాగా వళి యావలియొడ్డునఁ దన సేన లింద్రభట్టారకుని సేనలతోఁ దలపడెను. మధ్యాహ్నముదనుక తుములయుద్ధము జరిగెను. ఇంద్రభట్టారకుని చౌదంతి కుముదము తన సేనలను చీల్చిచెండా డెను. తన యేనుఁగులను గుమ్మిగ్రుమ్మి యుఱుకులు పెట్టిం చెను. తనకుఁగూడ ఒక్క చౌదంతి యుండెనా? తా నింద్ర భట్టారకుని యమపురికిఁ బంపియుండును. తన శరీరమంతయుఁ

బద్మరాగములు తాపినట్లుండెనని తనకుఁ దెలియదు. ప్రభువు స్థితి యశ్వము గ్రహించెను. తాను ఒడలు తెలియని వీరావేశ మున నశ్వమును చౌదంతిపై దూకింపఁజూచెను. కాని అది హేషాభయంకరముగ వెనుక కాళ్ళపై నిలిచి గిఱ్ఱునఁ దిరిగి చెంగుచెంగున నాలుగంగలలో రణరంగమునుండి తొలఁగి పశ్చి మాభిముఖముగఁ బఱతెంచెను. తనకు దేహముపై స్మృతి లేదు. స్మృతివచ్చుసరికి తాను మహారణ్యమధ్యమున నుండెను. అడుగులో అడుగు వైచికొనుచు అశ్వ మల్లే నడచుచుండెను. అది మహాకాంతారము కావలయును. తన దుస్తులన్నియుఁ దడిసియున్నవి. అశ్వము నాగావళి నెగువకొండలలో నెచ్చ టనో దాఁటివచ్చినది గావలయును.

యువరాజునకుఁ గన్నులును జెవులును, గ్రమముగాఁ బనిచేయ నారంభించెను. ఆయన కెటుచూచినను పైని మిణుఁ గుఱుల మెఱుపులు, క్రింద కీఁచుఱాల యఱపులు తప్ప వేఱే మియు గోచరించుటలేదు. అశ్వమున కడుగులు తడఁబడుచుం డెను గావలె. అది యూపిరి బిగఁబట్టి యడుగులు లెక్కించు చుండెను. మఱియొక క్షణములో అశ్వము హఠాత్తుగా బిగిసికొనిపోయెను. యువరాజు అశ్వమును మూఁపుపైఁ దట్టెను. అశ్వము శిలవలె స్తంభించిపోయెను. దాని జూలు ఏదుబంది ముళ్ళవలె నిక్కఁబొడిచి యుండెను. యువరాజునకు సర్వము నవగతమైనది. అది తన ప్రాణములు నిలిపినదిగాని

తాను దాని ప్రాణములు నిలుపఁజాలఁడు. మిలమిల మెఱయు చున్న ఆ జంటజ్యోతులు ఎంతో దూరమునలేవు. యువరాజు చెంగున గంతుకొని చేతికి దొరకిన శాఖనధిష్ఠించుట, పులి గాండ్రించుట, గుఱ్ఱము దారుణముగ సకిలించుట అన్నియు ఱెప్పపాటులో జరిగిపోయినవి.

యువరాజు కొంతవడి ఆ వృక్షశాఖను బల్లివలె నంటుకొని యుండెను. నడుమేయి మఱల నా పులిగాండ్రించుకొనుచు ఆ దిక్కునకు వచ్చుచుండెను. యువరాజు తానున్న శాఖను విడిచి మఱికొంత మీఁదికిఁబోయి కూర్చుండెను. పులి వచ్చి చెట్టుదరిపోవునట్లు గాండ్రింపసాగెను. యువరాజునకు ఆలాత చక్రములవంటి దాని నేత్రయుగళము తప్ప వేఱేమియు నగపడదయ్యెను. యువరాజు ఒఱపైఁ జేయివైచి చూచెను. రిత్తయొఱయే ఆయన చేతికిఁ దగిలెను. తన ఖడ్గమేమయినది? తెల్లవాఱువఱకు ఎగిరిన పులి యెగిరినట్లే యుండెను. అఱచిన పులి యఱచినట్లే యుండెను. తెలతెలవాఱుచుండ యువరాజునకు పులియెడమడొక్కలో దిగఁబడియున్న తన ఖడ్గపు రవ్వలపిడి మిలమిలలాడుచుఁ గానవచ్చెను. చెట్టు క్రింద దాని నెత్తురు వఱ్ఱులోఁడి దాని త్రొక్కిడులకుఁ జిక్కని రొంపియయ్యెను. వెలుఁగు రేకలు తోఁచినంతనే పులి వృక్షమూలమును పదిమాఱులు ప్రదక్షిణించి దక్షిణముఖముగా నరణ్యగర్భమున నంతర్ధానమొందెను. యువరాజు మఱికొంత

సేపు వృక్షశాఖమీఁదనేయుండి ఒకటి రెండు దుప్పు లాప్రాంత ములనడయాడుట తిలకించి యల్లనల్లన వృక్షము నవతరించి ప్రాగ్దిశాభిముఖుఁడై పయనింపసాగెను.

దినమెల్ల పయనించి యాయన మహాకాంతారమున మధువనప్రాంతమును జేరుకొనెను. ఆయనకుఁ బ్రాణములు శోషించిపోవుచుండెను. అదుగో వంశధార యిదుగో వంశధార యనుచుఁ బిడుచగట్టుచున్న నాలుకను బుజ్జగించుచుఁ దడఁబడుచున్న యడుగులకు ధైర్యముఁ గొల్పుచు ప్రాకిప్రాకి యువరాజు మొద్దువాఱిన తన మేనిని వంశధార యొద్దునకుఁ జేర్చెను. వంశధారా తరంగశీకర శీతలీకృత మందానిల పరిష్వంగముచే యువరాజు సర్వాంగములయందును ఘనీభవించిన చైతన్య ప్రవంతి యల్లనల్లనఁగదలియాడఁ దొడఁగెను. ఆస్పర్శ సుఖముచే ఆయన కొంతసేపు దాహము మఱచిపోయెను. దేహము మఱచిపోయెను.

ఇప్పుడీగాయములన్నియు సలుపరించుచున్నవి. కాయమంతయు విఱుగఁబొడిచినట్లున్నది. అవ్వలియొడ్డున మఱల సవ్వడి. గండుచీమల బారువలె శబరులు - స్త్రీపురుషులు వచ్చి నదిలో దిగి మూఁడు మున్కలువైచి మఱల వచ్చిన త్రోవనే తిరిగిపోవుచుండిరి. ఎవరిమట్టుకు వారు మెల్లఁగా నేనోమంత్రి ములు గొణిఁగికొనుచు నదిలో మున్కలువైచి తలవంచుకొని తమ త్రోవను దామ పోవుటయే తప్ప ఎవ్వరును అవ్వలి

తీరమున దృష్టి సారింపలేదు. చిట్టచివరివాఁడు గర్సడా. వాఁడు నీటిలో మునుఁగఁబోవుచు నెందులకో అవ్వలి యొడ్డున చూపు నిగిడించెను. అస్తంగతుఁడైన యంశుమంతుని యంతిమ కిరణము సోఁకి యచ్చట నేదో తళుక్కుమని మెఱసెను. గర్సడా పరిశీలించి చూచెను. ఎఱ్ఱని పొడలుగల పసుపుపచ్చని వస్తువేదో ఎదుటితీరమున మధుకవృక్ష మూలమునఁ బెనవైచుకొని యుండెను. గర్సడా ముఖము గంపంతయయ్యెను. వాఁడొక్కగంతున నొడ్డుఁజేరి శబరులందఱుఁ బోయిన త్రోవ తప్పించి యింకొక త్రోవను తుఱ్ఱున నడవిలోఁ దూఱిపోయెను.

గర్సడా యిరువదియైదేండ్ల యువకుఁడు. శబరులలో నందగాఁడే. విలువిద్యలోఁ దన యంతవాఁడు లేడని వాఁడు గర్వించును. ఇంద్రాణి చేతులలో నెన్నిసారు లోటువడినను దన పౌరుషమునకు లోటులేదని వాఁడు సగర్వముగఁ జాఁటుకొనుచుండెను. ఆమె మొగముఁ జూచిన కంటికి వేఱువస్తువుపై గుఱి నిలువదని వాని వాదము. ఇంద్రాణిపై వాఁడు నిగూఢముగఁ బ్రగాఢమైన వాంఛ పెట్టుకొని యుండెను. వాని నోడించి యేడిపించుట యామె కానందము. ఆమెను గెలిపించి కులికించుట వాని కానందము.

వంశధార పశ్చిమ తీరారణ్యములందు గర్సడా యొకనాఁడొక వింత సర్పమును జూచెను. అది చేపాటి లావున బారెఁడు పొడువుండెను. బంగరుచాయల మిసమిసలాడు దాని

యొడలినిండ పద్మరాగమణులు పొదిగినట్లెఱ్ఱని పొడలు, దోసెఁడు పడగపై ఉసిరికఁడంత మణి మిలమిలలాడుచుండెను, దాని చర్మమొలిచి యింద్రాణి నడుమునకుఁ జుట్టవలెనని, దాని పడగమీఁది మణి ఇంద్రాణి మెడలోఁ గట్టవలెనని వానికి మక్కువ పుట్టెను. అప్పు డింద్రాణి తనది కాఁగలదు. ఈ యాలోచన తట్టి విల్లెక్కుపెట్టు నప్పటికే అది ఎటు మాయ మయ్యెనో కంటికే చిక్కలేదు. వింటికేమి దక్కును? అది నేఁడు మఱల మధుకవృక్ష మూలమునఁ గనిపించినది.

యువరాజు బాధతో నటుపొరలి యిటుపొరలి బాహులు రెండును వెనుకకు మలచి మధుకవృక్షమూలమును గౌఁగిలించి చేరగిలఁబడి కునుకసాగెను. ముంచుకొని వచ్చుచున్న నిద్దుర నాపుటకై యాయన యెంతో ప్రయత్నించుచుండెను. ఒరిగి పోవుచున్న తలను సరిచేసికొనుచు, తొలఁగిపోవుచున్న శిరో వేష్టనమును పదిలపఱచుకొనుచు ఆయన నిద్దురమత్తులో నీఁదు లాడుచుండెను. గర్సడా విల్లమ్ములు చేతఁబట్టుకొని పరుగు పరుగున వచ్చెను. అటునిటుఁ గదలుచున్న రత్నకాంతి మసక మసకగా వాని కన్నుల కగపడుచుండెను. ఆ రత్నము ఇంద్రాణి కంఠమునఁ దళతళలాడి యామె మొగమున వలపు వెన్నెలలు విరిసినట్లు వాని నేత్రములు ఆనంద తరళము లయ్యెను. వాఁడొక విసపుటమ్ము తెగనిండ తిగిచి యారత్నపుఁ దళుకు గుఱిపెట్టి విడిచెను. అదిపోయి మధుకవృక్షమూలమున

నాఁటిన చప్పుడు వంశధారానది చిఱుతరఁగలపై చిట చిట లాడి యా మహాకాంతారమునఁ గలసిపోయెను. గర్సడా గుఱికిఁ జిక్కిన ప్రాణి మఱి బ్రతుకుట కూడనా? వాఁడు చంకలు కొట్టుకొనుచు నింటిదిక్కు పరువెత్తెను.



మహాకాంతారాంతరస్థమగు మాధవ వనమందలి పద్మ నాభపర్వతపరిసరములఁగల కీచకారణ్యమున జన్మించిన వంశ ధారానది ముఖలింగక్షేత్ర మధ్యమునఁ బ్రవహించి సాగర మును జేరుచున్నది. పంచక్రోశాత్మకమైన యా క్షేత్రమునఁ జతుర్ముఖ ప్రతిష్ఠితములైన కోటిలింగములు గలవు. వానిలో స్వయంభూలింగమూర్తి మధుకేశ్వరుఁడు.

ద్వాపరయుగమున వాసుదేవుఁడను మహర్షి వంశధారా నది పూర్వదిగ్భాగమున వ్యాపించియున్న మధుకవనమున నొక మహాయాగముచేయ సంకల్పించెను. ఆ మహర్షిచే నాహూ తులై ఇంద్రసహితులైన దేవతలు, మహర్షులు, గంధర్వ, సిద్ధ సాధ్య, విద్యాధర, కిన్నర, కింపురుషాదులేకాక బ్రహ్మ, విష్ణు మహేశ్వరులుకూడ యాగమునకు విచ్చేసిరి.

గండశిలలపై గలగల మని ప్రవహించు వంశధారానది మంజులకలనాదముతో గళములు మేళవించి ఋత్విక్కులు కావించు సామగానమునకు సదస్యులానందపరవశులగుచుండిరి. గానవిద్యావిశారదులగు గంధర్వులకు మాత్రమీ ఛాందస సంగీ తము చెవుల కెక్కలేదు. దూరమున మధుకవనాంతరాళము నుండి సన్నగా, తీయఁగా వినవచ్చు శబరయువతుల శింజాన

మంజులచరణమంజీరగుంజితములు వారి శ్రవోగోళములఁ జల్లఁగాఁ బ్రవేశించి చిత్తముల రంజిల్లఁ జేయుచుండెను. గంధర్వపతి చిత్రసేనుఁడు మెల్లఁగా లేచి మధుకవనము తెరువు పట్టెను. ఒకని వెనుక నొకఁడుగా గంధర్వులందఱును దమ యేలిక వెంట నరిగిరి. మధువనము ముందు నందనవన మెందులకు ? గంధర్వుల కొకవింత స్వర్గమునం దున్నట్లనిపించెను. మధుకపుష్పముల మధురగంధములు వారి నాసారంధ్రములకు మత్తెక్కించుచుండెను. వేణువీణాక్వణపాణింధమములైన శబర కామినీకోమల కంఠ కలకూజితములు వారి కర్ణపుటములకుఁ గైపెక్కించుచుండెను. ఓహో ! ఈ శబరసుందరుల యందమేమి యందము ! పుష్పాసవాఘూర్ణితనేత్రలై కొదమతుమ్మెదలవలె ఝుమ్మని గానమొనరించు శబరమదిరాక్షులు ఱెప్పపాటెఱుఁగని గంధర్వుల కంటిపాపలలో నిగనిగలాడుచుండిరి. ఒక్కొక్క గంధర్వుఁ డొక్కొక్క శబరాంగన యంగభంగిమల జాలువాఱు లావణ్యమును చేరలతోఁ ద్రావుచుండెను. శబరకాంతల శరీరచ్ఛాయలు తమ శరీచ్ఛాయలఁ దవుల్కొని గంధర్వులెల్లరు దేవేంద్రుల మనుకొనుచుండిరి. ఆ గంధర్వులు తమ మగలేయని శబరముగ్ధలు భావించుచుండిరి. పాడి, యాడి, సొక్కిసోలిన యా చక్కని చుక్కల నొక్కొక్క గంధర్వుఁ డొక్కొక్క దానినిగాఁ దన చిక్కని పైఁడి ఱెక్కలఁ బొదివికొని నికటపర్ణకుటీరములలోనికిఁ దీసికొనిపోయెను.

యాగావసానమున వామదేవమహర్షి యజ్ఞపురుషుఁడగు శ్రీమహావిష్ణువును, బ్రహ్మేశానులును విధిదృష్ట విధానముల నర్చించి ఇంద్రపురస్సరులగు దేవతలకు యాగభాగములర్పించి గంధర్వుల నాహ్వానించెను. గంధర్వులేరి? సదస్సంతయు నొక్కసారి కలవరపాటుఁ జెందెను! గంధర్వులేరి? ఒక్కఁడును లేఁడే! మహర్షి కనుబొమలనడుమ ధూమరేఖలు బయలుదేఱెను. ఆయన ఫాలము బొగచూరి తప్తారకూటఫలకమును బోలియుండెను. పరిషత్తుభయప్రకంపితమగుచుండెను. మహర్షి ముఖమండలము హోమకుండమునకుఁ బ్రతిబింబ మన్నట్లుండెను. ఆయన నిటాలమున ఛటచ్ఛటారవము లుప్పతిల్లుచుండెను. మధువనాంతరాళమున "గంధర్వులారా! ఓహో! గంధర్వులారా!" అను నాధ్వానములు సహస్రధా ప్రతిధ్వానములై వియదంతరాళమునఁ గలిసిపోయెను. చిత్రసేన పురస్సరులై గంధర్వులు ఆనతమస్తకులు, ఆబద్ధాంజలులునై వామదేవ మహర్షి యెదుట నిలిచియుండిరి. మహర్షి కన్నులు మూఁతలుపడియే యుండెను. ఆయన నిటలమునఁ గ్రోధాగ్ని కణకణలాడెను. ఆ వేఁడిమికి గంధర్వులకాయము లెల్ల చురచురలాడి కమరి కాటుక ప్రోవులయ్యెను. గంధర్వుల మస్తకముల మకుటములేవి? కతుములఁ గనకపతుములేవి?

వంశధారానది ప్రాక్తీరమున మధుకవృక్షమూలమునఁ జిత్రాసనమునఁ గూర్చుండి అగ్నిస్వామి యీ వృత్తాంతముఁ

జెప్పుచుండెను. శబరులందఱును నోళ్లు తెఱచుకొని వినుచుం డిరి. గంధర్వుల మస్తకముఁ మకుటములేవి ? కఱములఁ గనక పఱములేవి ? శబరులందఱు నొక్కసారిగా మస్తకములు, కఱ ములు దడవుకొని దీనముగ, దీర్ఘముగ నిశ్శ్వసించిరి.

అగ్నిస్వామి చెప్పుచుండెను. "శబరయోనుల జన్మింపుఁ డని" వాసుదేవమహర్షిచే నభిశప్తులై గంధర్వులు గడగడవడంకి పోయిరి. మహర్షి పాదముల వ్రాలి శాపము నుపసంహరింపు మని వేఁడిరి. మహర్షి వారికి యజ్ఞపురుషుని చూపించెను. గంధర్వులు విష్ణుదేవుని పాదములపైఁబడి "ప్రభూ! దయఁ జూడు" మని ప్రార్థించిరి. "అమోఘమగు వాసుదేవుని వాక్కును అన్యథాకరించుట నావలనఁగాదు. నేనీ క్షేత్రమునకు పాలకుఁడను మాత్రమే. దైవము పరమేశ్వరుఁడు. ఆయనయే మీకు శాపావసానము ప్రసాదింపఁగలఁడు" అని విష్ణుదేవుఁడు గంధర్వులను పరమేశ్వరునకు నివేదించెను. పరమకరుణామయుఁ డగు పరమేశ్వరుఁడు పరిదీనవదనులగు గంధర్వులను ప్రసన్న దృష్టుల నవలోకించి యిట్లనెను. "శబరకామినీ గర్భములం దిం తకుమున్నే మీ మీ యంశముల నాధానముఁ గావించియుంటిరి గదా. ఆ గర్భములందే మీరు జన్మింపుఁడు. పద్మనాభగిరి నధిష్ఠించి విష్ణుదేవుఁడు మిముఁ బరిరక్షించుచుండును. ద్వాప రాంతమున నేనీ మధువనమునం దవతరింతును. నా ముఖలింగా కృతిని దర్శించి మీరు తరింతురు. అందాక ఈ మధువనమే

మీకు నందనవనము. మధుకవృక్షములే మందారవృక్షములు. మాధవరసపానమే యమృతరసపానము."

శాపోపహతులైన యా గంధర్వులు శబర గృహముల జన్మించిరి. గంధర్వపతియగు చిత్రసేనుఁడు చిత్రగాయకుఁడను పేర శబరజాతికి నాయకుఁడై యుండెను. శబరకన్యల యంద ములు నిలువఁబోసిన గరిసెచిత్తి. అది చిత్రగాయకుని ప్రియ పత్నియై వానిని రాగసాగరమున శృంగారతరంగములఁ దేలి యాడించుచుండెను. శాపోపరక్తుఁడు, శబరకాంతానురక్తుఁ డునై చిత్రసేనుఁడు తన లోకమును, తన భార్యను మఱచెను. కాని వాని యాత్మనంటియున్న గానముమాత్రము వానిని వెన్నంటియే యుండెను. మధువనమున వానిగానమునకు సాధనముకానిదేదియులేదు. వంశధారావాహినిపైఁ దేలివచ్చు వెదురుగొట్టములు వాని పెదవులంటి వేణువులై పోవును. జీలుగుకొమ్మలు వాని ఱొమ్ములపై ప్రాలి వీణియలై పోవును. మధుకవృక్షస్కంధములు వానికటిభాగమున వ్రేలి మృదంగములై పోవును. వంశధారయందలి గండశిలాఖండ ములు వానికరముల నాశ్రయించి కంచుతాళములై కంగు కంగున మ్రోఁగిపోవును. వాని గానమునకు కీచక కానన మంతయుఁ గరఁగి యమృతధారయై ప్రవహించును. మధువన మంతయు మకరందబిందువులు వర్షించును.

ప్రతిదినమును శబరులు వేఁటాడి వివిధ జంతువులను వధించి తమ నాయకునకు ఆహారముగాఁ దెచ్చి యర్పించు చుందురు. చిత్రగాయకుని విచిత్రగాన మాచచ్చినజంతువులకు ప్రాణములు పోయును. ఒక శబరుని మెడమీఁది యడవిపంది గుఱ్ఱుమనును. వాఁడు అదరిపడి దానిని దిగవిడుచును. అది తుఱ్ఱున నొక పొదలోఁ దూఱును. ఇంకొక శబరుని చంకలోని జింకపిల్ల గిల గిల తన్నుకొనును. వాఁడు చక్కిలిగింత పుట్టి చంకపట్టు సడలించును. అది చెంగున దూకి యొక్కదాఁటున వంశధార యావలితీరముఁ జేరును. వేఱొక్కని గుప్పిటిలోని గువ్వపిట్ట కువకువలాఁడును. వాఁడు పిడికిలి బిగించులోపల నది దూసికొనిపోయి ఇప్పచెట్టు చిటారుకొమ్మపైఁ గూర్చుండును. శబరులందఱు పగలఁబడి నవ్వుకొందురు. నవ్వులు చల్లాఱిన వెనుక నెవ్వనిగుడిసెకు వాఁడు పోవును. చిత్రగాయకుఁడు గుప్పెడు ఇప్పపువ్వు తిని రెండుచేరల నీరు త్రావి తీయని సంగీతములు తేర్చును.

చిత్రగాయకుని నిత్యభుక్తి యిట్లు జరుగుచుండును. ఈ భుక్తితో వానికి జరిగినదిగాని చిత్తి కెట్లు జరుగును? అది యొకనాఁడు భర్తతో నిట్లన్నది, "సంగీతములు పాడి చచ్చిన జంతువులకుఁ బ్రాణములు పోయుచుంటివి. అది ధర్మమే యనుము. భుక్తి యిడక నా ప్రాణములు తీయుచుంటివి. ఇది యేటికర్మము?" వాఁడు నవ్వి యిట్లనెను: ఏమి! చత్తునని నీకు

భయమెత్తుచున్నదా ! పిచ్చిదానా ! నా యందాల చిత్తిని నేను చావనిత్తునటే !"

"చావనియ్యవు సరే. మఱి బ్రతుకనియ్యవేమి ?"

"బ్రతికియే యుంటివిగదా !"

"నీ కంటికి బ్రతికినట్లే యుంటిని. ఆఁకలిమంటచే లోలోనఁ జచ్చుచునే యుంటిని."

"భయపడకుము. నేను బ్రతికింతునులే."

"బాగున్నది. మాటిమాటికి ఆఁకటిచే నేను చచ్చుట, పాటలుపాడి నీవు బ్రతికించుట, పూట పూట కిది యొక యాటయా ?"

"బ్రతికించుట నా పని. నీకెందుకే బాధ !"

"మంచిమాటయే. బ్రతికించుట నీకు పాటలతోఁ గావచ్చునుగాని చచ్చుట నాకు మాటలతో నగునా ?"

"మఱి యేమందువు ?"

"మాటిమాటికి నేనీ యాఁకటిచావులు చావలేను."

అని చిత్తి మూతి బిగించుకొనెను. చిత్రగాయకుఁడు చిఱునవ్వు నవ్వుచు చిత్తిని కౌఁగిటిలోనికిఁ దీసికొని "ఓసీ ! నీకు నీ ప్రాణము లెంతతీపియో నాకు నీవంతకు మిక్కిలి తీపి కదా. నిన్ను నేను చావనిత్తునా ?" అని బుజ్జగించెను. చిత్తి యాతని వక్షఃస్థలమందలి పూసలపేరులు సవరించుచు "అది కాదు. ఒకవేళ నీవు పాటపాడుట కొంతసేపు మఱచితివను

కొనుము. అంతసేపును నేను చచ్చిపోవలసినదే కదా. నన్ను విడిచి నీవుమాత్రి మంతసేపు బ్రతుకఁగలవా ?" అని వాని కన్నులలోనికిఁ జూచెను. చిత్రిగాయకుని కన్నులలో నొక క్రొత్త తెలివి తోలుకాడెను. వాఁడిట్లనెను.

"అయిన నన్నిప్పుడేమి చేయమందువు ?"

"నా కేదయిన బ్రితుకుఁదెరువు చూపుమందును."

"సరే. రా. చూపుదును."

అని వాఁడు చిత్తిని వెంటనిడుకొని వంశధార యొడ్డునకు వచ్చెను. అచ్చట విరుగఁబూచిన యొక బాలమధుకమును జూపి "ఇదిగో ! ఈ చెట్టు నీది. ఈ పుట్ట దీనికి గుఱుతు. ఇతరు లెవ్వరును దీనిని ముట్టరాదని కట్టడిచేయుదును. దీని పువ్వుతో నీ వెట్లయిన భుక్తి గడుపుకొనుము" అనెను.

"ఇదియే యా మధూకవృక్షము. ఈ పుట్టయే ఆ పుట్ట" అని అగ్నిస్వామి చెప్పఁగా శబరులందఱును జేతులెత్తి యాచెట్టునకు, ఆ పుట్టకు మ్రొక్కుకొనిరి.



శబరాధినాయకుఁడు వృద్ధపుళిందసేనుఁడు వ్యాఘ్ర పీఠమునందాసీనుఁడై చిత్రగాయకుని వృత్తాంతము శ్రద్ధ ధానుఁడై వినుచుండెను. ఆయన ఏకైక పుత్రిక ఇంద్రాణి తండ్రి చరణోపాంతమునఁ గూర్చుండి కథ వినుచుండెను. కాని యామె మనస్సు మాటిమాటికి వంశధార యావలితీరమునకుఁ బోయివచ్చుచుండెను. సంధ్యావేళ ఆ తీరమున నీరు త్రావుచుం డిన పురుషుఁ డెవ్వఁడు? శిరమునందలి యుష్ణీషమును బట్టి యతఁడొక రాజకుమారుఁడై యుండవచ్చునని యామె కని పించినది. కాని యా దుస్తులేమి? చౌదంతి తుండమునందలి ఎఱ్ఱని మచ్చలవంటి యా మచ్చలేమి? ఆతఁడెవ్వఁడో! మధుక వృక్షమునకు మ్రొక్కుటకై యెత్తినచేతు లెత్తినట్లేయుండ ఇంద్రాణి యీ యాలోచనలోఁ బడిపోయెను.

గర్సడాకు కథసంగతియే పట్టలేదు. మస్తకన్యస్తాంజ లియై, యాలోచనాపరవశయై ఇంద్రనీలమణి శిల్పమువలె నున్న యామె యంగసంపదమీఁదనే వాని దృష్టి లగ్నమైయుం డెను. పిడికిటికి రాని యామెనడుమున నెప్పుడా చిత్రవర్ణ సర్ప చర్మము నలంకరింతునా, కౌఁగిటనిముడని యామె వక్షఃస్థల మున నా సర్పశిరోమణి నెప్పు డలంకరింతునా యని వాని చిత్త మారాట పడుచుండెను.

అగ్నిస్వామి చెప్పుచుండెను :

ఆ మధుకవృక్షము ఏడాదిపొడుగునను పుష్పించు చుండును. ప్రతిదినమును ఉదయమున చిత్తి యా పూలను గంపకెత్తి, గంప నెత్తిపైనిడికొని వంశధారానది పశ్చిమతీరము నందలి సుమంతపురమున నొక వణిజునకు విక్రయించి యా వచ్చిన సొమ్ముతో దినవెచ్చములు తెచ్చుకొని తనపొట్ట గడుపు కొనుచు భర్తను సుఖపెట్టుచుండెను.

ఇచ్చట చిత్రగాయకుని వృత్తాంత మిట్లుండఁగా నచ్చట గంధర్వలోకమున నాతని భార్య చిత్కళ భర్తకు సంభవించిన యాపద విని పరిపరి విధముల దుఃఖించి యాతఁడెప్పుడు శాప ముక్తుఁడై తిరిగివచ్చునాయని యెదురు చూచుచుండెను. ఎంత కాలమునకును పతి తిరిగిరానందుల కామె మిక్కిలి చింతించి పరమేశ్వరుని సన్నిధి కరిగి తన యవస్థను గూర్చి మొఱపెట్టు కొనెను. పరమేశ్వరుఁ డామెతో నిట్లనెను. "చిత్కళాదేవీ! నేనేమిచేయుదునమ్మా! శబరకాంతాలోలుఁడై నీ పతి నన్ను స్మరించుటయే లేదు. నేనెట్లు వానికి దర్శనమిత్తును? ఇప్పుడు నిన్నుఁ జూడఁగనే నాకొక యూహ పోవుచున్నది. నీవుకూడ మధువనమున శబరకాంతవై జన్మించి, నీ సౌందర్యముచే వాని చిత్తము నాకర్షించి నేర్పుగా నా దెస మఱలింపుము. మీఁది సంగతి నేను చూచుకొందును." పరమేశ్వరుని పలుకులు విని చిత్కళాదేవి యిట్లనెను. "ప్రభూ! ధర్మబాహ్యమైన శబరజాతి

యందు నేను జన్మింపఁజాలను. అందును కర్మహీనమైన మహా కాంతారమున నెట్లు జన్మింతును ?" పరమేశ్వరుఁ డామె పలుకులకు సంతసించి "అట్లయినచో ఒక పనిచేయుము. శ్రీశైలమున నేను మల్లికార్జున నామమున వెలసియున్నాను. అది పరమపవిత్రక్షేత్రము. నీవు నా యర్చకుని గర్భమున జన్మింపుము. కృష్ణాగోదావరీ తీరస్థములగు శైవక్షేత్రము లన్నియు దర్శించుచుఁ గ్రమముగా వంశధారాతీర మధువనములం జేరి నీ పతిని దర్శింపుము. ద్వాపరాంతము సమీపించుచున్నది. యథాకాలమున నేను మధువనమునం దావిర్భవింపఁగలను" అని యానతిచ్చెను.

పరమేశ్వరుఁ డాజ్ఞాపించినట్లే చిత్కళాదేవి యొకనాఁటి మిట్టమధ్యాహ్నమున మధూకారణ్య ప్రాంతములఁ జేరుకొనెను. దూరమునఁ జిత్రగాయకుఁడు మధుకవృక్ష మూలమునఁ గూర్చుండి మురళి మ్రోయించుచుండెను. ఆ మురళీగానమునందలి గాంధార గ్రామ మూర్ఛన లామె వెంటనే గుర్తుపట్టెను. ఆ పోకడలొక్క గంధర్వులే పోఁగలరు. చిత్కళాదేవి యాననమున నానందరేఖ తొంగిచూచెను. పతి శబరాకృతి యెట్లుండెనో ! తాను గుర్తింపఁజాలునో చాలదో శబరాకృతులైన పలువురు గంధర్వులలోఁ దన పతిని తానెట్లు గుర్తించుట ? చిత్కళాదేవి మధుకవృక్షమును సమీపించిన కొలఁది మురళీగాన మామెకు స్ఫుటతరమగుచుండెను. స్ఫుట

తరమైన కొలఁదియు అందుఁ దన పతి రాగచ్ఛాయలు తేట పడుచుండెను. వృక్షమూలమునఁ జిత్రగాయకుని మూర్తి యామె కక్షిగోచరమయ్యెను. అతఁడు తన పతియే! వృక్ష చ్ఛాయ వ్యాపించి శరీరము నీలవర్ణముగనున్నది. చిత్కళాదేవి చిఱునవ్వు పెదవులఁ జిందులాడఁ జిత్రగాయకుని యెదుట నమ స్కరించి నిలువఁబడెను. అట్టివేళ, నట్టిచోట నట్టి యపరిచిత వ్యక్తినిఁగాంచి చిత్రగాయకుఁ డాశ్చర్యచకితుఁడై "అపూర్వ రూపలావణ్యవతియగు యువతీ నీ వెవ్వతెవు ? గంధర్వకామి నివా ? కిన్నరనారివా ? ఈ భయంకర వనసీమలనడుమ నీశబర భూముల కొంటరిగా నెట్లు వచ్చితివి ?" అని ప్రశ్నించెను. చిత్కళ యా మాటలకుఁ బకపకనవ్వి "శబరనాయకుఁడా! నీ విప్పుడు గంధర్వపతివన్నచో నెవ్వరైన నమ్ముదురా ? అట్లే నేనును గంధర్వకామినినన్నచో నెవ్వరు నమ్ముదురు ?" అనెను.

"నేను నమ్ముదును !"

"నీ వార్యుఁడవు గనుక నమ్ముదువు. అనార్యులు నవ్వి పోదురుగదా !"

"ఇంతకును నీ వెవ్వతెవో చెప్పవైతివి ?"

"నీవే చెప్పితివిగదా గంధర్వకామినినని"

"నిజమా ?"

"నమ్మకమప్పుడే పోయినదా ?"

చిత్రగాయకుఁడు వింతనవ్వునవ్వెను.

"నేనొక సామాన్యజంగమాంగనను. కనిపించుటలేదా గళమందలి శివలింగము ?"

"నేనింతవఱకు నీముఖమే చూచుచుంటిని."

చిత్కళ నవ్వెను. చిత్రగాయకుఁడును నవ్వెను.

"నీవిచ్చటికేల వచ్చితివి ?"

"త్రోవతప్పి వచ్చితిని."

"త్రోవతప్పినచో నిచ్చటికే యేలరావలెను ?"

"మఱి యెచ్చటికిఁ బోవలెను ?"

"ఎచ్చటికేని పోవచ్చునుగదా !"

చిత్రగాయకుని చిత్తమున దోఁబూచులాడుచున్న జన్మాంతరస్మృతి చిత్కళను కలకల నవ్వించెను.

నిజము చెప్పుము. నీ విచ్చటికి రావలెననియే వచ్చితివి. అవునా ?

"అట్లే యనుకొనుము."

"కాదు. నీవు నిజము చెప్పుము."

"అవును రావలెననియే వచ్చితిని."

"దేనికొఱకు ?"

"దేనికొఱకో !"

"కాదు. నాకొఱకే ?"

"అవును. నీ కొఱకే ?"

చిత్రగాయకుఁడు తృప్తిగా నవ్వెను.

"నేనును నీకొఱకే యిచ్చటఁ గూర్చుంటిని"

చిత్కళ కన్నులతో నవ్వెను.

"నిజముగా నీకొఱకే కూర్చుంటిని. ప్రతిదినమును సుమంతపురమునకుఁ బోయివచ్చు చిత్తికొఱ కిచ్చట కాచుకొని యుందును. నేఁడు చిత్తి పురమునకుఁ బోలేదుగదా! మఱి నే నెవ్వరికొఱ కిచ్చట నెదురు చూచుచుంటిని?"

"చిత్తి యెవ్వతె?"

"ఎవ్వతె కొఱకో నేనేల యెదురుచూతును? చిత్తి నా భార్య."

"ఇప్పుడు నా కొఱకెదురు చూచుచుంటినంటివికదా. మఱి నేనుగూడ........"

చిత్రగాయకుఁడు తెల్లఁబోయి పకాలున నవ్వెను. చివాలునలేచి చిత్కళ భుజములపైఁ జేతులువైచి యామె మొగములో మొగము పెట్టి చూచుచు "ఎన్నాళ్ళకు వచ్చితివి?" అనెను. తెప్పపాటు మఱచిన యా కన్నులు గంధర్వపతి చిత్రసేనునివే. ఆ కన్నుల కొలుకులందు అశ్రుబిందువులు తొలుకుచుండెను. చిత్కళ యా బిందువులను చిటికెనవ్రేలఁ జిందుచు "చిత్తియందగత్తెయేనా?" అనెను. చిత్రగాయకుఁడు తెప్పలప్పళించుకొనుచు "అది మిక్కిలి యందగత్తె"యనెను. చిత్కళ మొగము చిన్నఁబుచ్చుకొనెను. చిత్రగాయకుఁ డామె చుబుకము పుడుకుచు నిట్లనెను. "నీవును అందగత్తెవే. దాని

యందమువేఱు. నీ యందమువేఱు. దాని యందము నల్లనిది. నీ యందము తెల్లనిది. దాని యందములో అది యగపడదు. నీ యందములో నీవే యగపడుదువు. దానిలోని యందమును కామింతును. అందములోని నిన్ను ప్రేమింతును. రమ్ము కుటీరమునకుఁ బోవుదము."

ఇరువురు నింటివైపు బయలుదేరిరి. త్రోవలో చిత్రగాయకుఁ డడిగెను: "నీ పేరేమంటివి?" "ఇప్పటికి పేరు కావలసివచ్చినదా?" యని చిత్కళ పకపక నవ్వెను.

తనకుఁ దెలియకుండఁగనే ఇంద్రాణి పకాలున నవ్వెను. గర్సడా యింద్రాణి ప్రక్కనెప్పుడు చేరెనో! తటాలున వాఁడామెచేతులు పట్టుకొనెను. సభయంతయు నొక్కసారి వెనుదిరిగి చూచెను. వృద్ధపుళిందసేనుఁడు ఎడమచేత కూఁతురి నోరు నొక్కి కుడిచేత గర్సడా వీపుపై నొక్కటి చఱచెను. వాఁడు కిక్కురు మనలేదు. అగ్నిస్వామి కథ చెప్పుకొని పోవుచుండెను. శబరులందఱును సర్దుకొని మఱల శ్రద్ధతో నాలకించుచుండిరి.

కుటీర ద్వారమున నిలిచి చిత్రగాయకుఁడు "చిత్తీ! చిత్తీ! నీ చెల్లివచ్చినదే" అనెను. చిత్తి గబగబ గుడిసె బయటికి వచ్చి చిత్కళ మొగము చూచి తెల్లబోయెను. చిత్కళ యామె యందముఁ జూచి యాశ్చర్యపడెను. తటాలున నామెను గౌఁగిలించుకొని "అక్కా! నేను చిత్కళను. నన్నెఱుఁగవా?"

యనెను. చిత్తికేమియుఁ బాలుపోలేదు. ఈ యపరిచిత యువతి యనురాగాభినయము నందామె యుక్కిరిబిక్కిరి యగుచుండెను. ఆమె వలపుటురులు చిత్తికంఠమును బెనవైచుకొని దాని నోటమాట పెగలనిచ్చుటలేదు. చిత్కళ దానిని మఱింత బిగువుగాఁ గౌఁగిలించుచు "అక్కా! ఇప్పటికైన గుర్తువచ్చినదా ?" యనెను. చిత్తి బలవంతముగా నవ్వుచు, "రాకేమి ? చిత్రగాయకుని ముద్దు పెండ్లమవుగాదా ?" యనెను. చిత్కళా చిత్రగాయకులు ఒకరిపై నొకరు చిఱునవ్వు పువ్వులు రువ్వుకొనిరి. చిత్తి మగనిదెస రుసరుసలాడుచుఁ జిత్కళను జేతఁ బట్టుకొని కుటీరములోనికిఁ బోయెను.

కుటీరము వాకిటఁ గూర్చుండి చిత్రగాయకుఁడు మురళిపై జిఱునవ్వులు కూనరాగములు తీయుచుండెను. ఆ రాగములు తీఁగెలుసాగి గుడిసెలోఁ జేరిన చిత్తి చిత్కళల శరీరములఁ జిక్కఁగా నల్లుకొని పోవుచుండెను.



## ౪

మధుకవృక్షమూలమున విసపుటమ్మునకుఁ దగుల్కొని యువరాజు నుష్ణీషమల్లే వ్రేలాడుచుండెను. ఆయన మాత్రము నిద్దురమత్తున శిశిరశీతలానిలములు దొరలించినట్లెల్ల దొరలిదొరలి వంశధారాతీరాంచలమునఁ బడియుండెను. ఆయన యొడలిపైఁ జుఱుకుచుఱుక్కు మనుచున్నవి కత్తులగాటులో, సీతువు కాటులో! నిద్ర సుఖ మెఱుఁగదుగదా! ఆయన నిద్ర నాపుకొనుట కెంత ప్రయత్నించెనో అది యాయన నంతఁగా నాక్రమించెను. ఆయన యట్లెంత సేపు నిద్రించెనో! సీతువాయనను వేయికోఱలతోఁ బట్టి కఱచుచుండెను. కఱచినచోటెల్ల నిద్రాదేవి తన సుకుమారకరముల నిమురుచుండెను. క్రమముగా నాయన మనస్సు జాగృతమగుచుండెను. కాని యింద్రియములను జడత్వ మాక్రమించుకొని యుండెను. సర్వేంద్రియ మార్గములును జడతానిరుద్ధములగుటచే చైతన్య ప్రవాహమాయన యంతరంగమునఁ బొంగి పొరలి పోవుచుండెను. ఆ పొర్లు మెల్ల మెల్లఁగా త్వగింద్రియమునఁ బలుచని పొరగాఁ బఱచుకొనుచుండెను. గండశిలలపై గఱకఱనూఱి చికిలిచేసిన యొక చిఱుతతరఁగకొనతో వంశధారాతరంగిణి యువరాజు చెక్కిలిపై చుఱుక్కున గీఱెను. ఆయన యులికిపడి నదిలోనికి దొరలిపోయెను. నిద్రాదేవి ఆయన కాలుసేతులు కట్టివైచెను.

చైతన్య ప్రవంతి కట్టత్రెంచుకొని యాయన త్వగింద్రియ మందలి సర్వనాళముల నొక్కసారిగా నింపివైచెను. ఆయన యొడలువ్పొంగి నిద్రాపాశములను పెట పెట త్రెంచివైచెను. ఆయన కోడెత్రాఁచువలె బుస్సలుకొట్టుచు నదికడ్డముగాఁ బాఁకిపోవుచుండెను. ఆయన కంటిపై నిద్దుర కుబుసపుఁ బొర లింకను విడిపోవుటలేదు. తన శిరమున నుష్ణీషములేదని యాయ నకుఁ దెలిసినట్లులేదు. ఆ యుష్ణీషము తడిసిపోవునని యాయన పడగ మీఁదికెత్తుకొనియే యీఁదుకొని పోవుచుండెను. ఇప్ప పూలఱెప్ప చేతికిఁ దగిలినప్పుడెల్ల తీరము చేరితిననియే ఆయన భ్రమపడుచుండెను. మెల్లమెల్లగా నాయన కనుఱెప్పలు తెఱపి యిచ్చుచుండెను గాని యేమి లాభము? ఆ మహోకాం తారాంతరాళమున, ఆ మాఘకృష్ణ చతుర్దశీ నిశీధినీమధ్యమున, ఆ వంశధారా నదీగర్భమున ఆయనకు దిక్కులన్నియు నొక్క తీరుననే యుండెను. ఏ దిక్కు ఎట్లులుండిన నాయన కేమిపట్టి నది? ఆయనకుఁ గావలసిన దొక్కటే దిక్కు. అది వంశధార యవ్వలితీరము.

అవును. అది వంశధార యవ్వలితీరమే. ఆ తీరమందలి జీలుగుచెట్టాయనకుఁ జేయూఁత నిచ్చుచుండెను. యువరాజా చేతిని పట్టుకొని యలసిపోయిన శరీరము నెట్లో తీరమునకుఁ జేర్చెను. గాయములమీఁది పొరలు చిటిలి రక్తము సన్నగాఁ గాఱుచున్నది గావలయును. యువరాజునకు శరీరమంతయుఁ

జెమ్మగా వెచ్చగా నుండెను. ఆవెచ్చదన మాయనకు గ్రొత్త యుత్సాహము పుట్టించెను. జీలుగుకొమ్మపై రవంతసేపు మేనువాల్చి సందెవేళ శబరుల జారు పోయిన దారిని పాదములతో దడవుకొనుచు బయలుదేఱెను.

అగ్నిస్వామి చెప్పుచుండెను :

చిత్రగాయకుడా మధుకవృక్షము నిద్దఱు భార్యలకు జెఱిసగము పంచియిచ్చెను. దక్షిణశాఖ చిత్తిది. ఉత్తరశాఖ చిత్కళది. వారిద్దఱును జిత్రగాయకుని జెఱిసగము పంచుకొనిరి. చిత్తి కొకపక్షము, చిత్కళ కొకపక్షము. చిత్కళ తనకు శుక్లపక్షము కావలెననెను. చిత్తి తనకును శుక్లపక్షమే కావలెననెను. దానితో గీచులాట యారంభమయ్యెను. చిత్రగాయకుడు పాపము చిక్కునబడిపోయెను. వాడాలోచించి యాలోచించి యొక తీర్పు చెప్పెను. చిత్తి చీకటిలో గలసిపోవును. చిత్కళ వెన్నెలలో గరగిపోవును. కనుక శుక్లపక్షమున జిత్తితో నుందును. కృష్ణపక్షమున జిత్కళతో నుందును. ఇరువురు నీ తీర్పున కంగీకరించిరి. మగడు తన పక్షమే పలికెనని చిత్తి సంతసిల్లెను. మగడు తనకు సగము దక్కకదాయని చిత్కళ యూరడిల్లెను.

ప్రతిదినమును చిత్తి చీకటి మొగముననే లేచి తన కొమ్మక్రింద పూలు తా నేఱుకొని గంపకెత్తుకొనును. చిత్కళ యంతకుమున్నే లేచి నదిలో స్నానమాడి మధుకవృక్షమూల

మున నరికి ముగ్గులిడి మహాదేవుని మనస్సున ధ్యానించుకొని వృక్షమూలమునే లింగముగా భావించి వంశధారా జలముల నభిషేకముఁ జేయును. తన కొమ్మక్రింది పూలను ఏంచి యెంచి యేటి వంచె గట్టుకొనును. ఇరువురును గలిసి సుమంతపురమున వణిజునింటికిఁ బోదురు. ఆ వణిజుఁడు చెఱిసమానముగ సరకు లిచ్చి పంపును. చిత్తి మొగము చిన్నఁబుచ్చుకొనును. ఇరువురు నింటిమొగము పట్టుదురు. ఒకరినొకరు పలుకరించుకొనరు. ఎవరిగుడిసెకు వారు పోదురు. కొంతకాలమిట్లు జరిగెను. ఒక నాఁడు చిత్తి వణిజుని నిగ్గదీసెను. "ఏమయ్యా! ఈ యన్యాయము ? నా గంపెఁడు పూవునకు దాని వంచెడు పూవునకు నొకశే వెల కట్టెదవు ?" వణిజుఁడు "నీ గంపెఁడు పూలలో మంచివెన్నో యెంచి చూపించుము. వంచెకుమించినచోఁ జెవి కోయించుకొందును" అని కసరుకొనెను. చిత్తి యంతటి నోరెత్తఁజాలకపోయెను. మఱి కొంతకాల మిట్లు జరిగెను.

చిత్రిగాయకుఁడు శుక్లపక్షమంతయుఁ జిత్తి యింట గుట్టువెట్టి నిద్రిపోవును. అది వాని చెవిచెంతఁ జేరి పోరినది పోరి నట్లే యుండును. కోడెనాగువంటి తన మగఁడు కొండచిలువ యగుచున్నాఁడు. ఒడలినిండ నీ బూడిదపొడలేమిటి ? సవతి తన మగని కేదోమంత్రిము పెట్టినది ? ఈ నడుమఁ దాను నడురేయికేపోయి రెండుకొమ్మల పూవులును దానే యూడ్చి కొనిపోవుచున్నది, సవతి కొక్కపూవును దక్కనిచ్చుట లేదు.

దానికీనడుమఁ దీర్ఘమే ప్రసాదమైపోయినది. కృష్ణపక్షమంతయు మగని మొగమునఁగూడ నాతీర్థమే పోసినది గావలయును. మగనికి డొక్కలంటుకొని పోయినవి. కుండె డిప్పకల్లు గుక్కలోఁ దాగివిచినాఁడు. కడుపునిండినది గావలయును. పాపము. కదలకుండఁ బండుకొన్నాఁడు. కంటినిండ నిదురపోవు చున్నాఁడు.

చిత్రగాయకుఁడు పున్నమ తెల్లవాఱనీయఁడు. నడురేయి చిత్తి నటు పోనిచ్చి తానిటుపోయి చిత్కళ కుటీరమునఁ దూఱును. కృష్ణపక్షపు రేల వాఁడు కునుకఁడు. చిత్కళను గునుకనీయఁడు. వాఁడామె నడుమునకు మెడకుఁ బెనవైచుకొని యామె శిరముపైఁ బడగెత్తి యాడఁగోరును. ముఖార్పితైకాంగుళి సంజ్ఞచే వాని నామె వారించును. వాఁడు పడగ ముడుచుకొని కడకంకటిపై బొరలాడును. ఆమె వానికి జల్లగా గంధర్వలోకపుఁ గథలు చెప్పుచు వాని యొడలెల్ల విభూతిచేతులతోఁ దడవును. వాఁడు అలుకవిడిచి మరలఁ బడ గెత్తి కంకటినడుమఁ బద్మాసనము వైచికొని కూర్చుండును. ఆమె వాని యెదుట నిలిచి వెన్నెలతీఁగవలె మెలికలు తిరుగుచు శివలీలలు జోలలు పాడును. వాఁడు కన్నులు వీనులలోఁ గలిసిపోయి యామె యాటపాటల నాలోకించి యాలకించు చుండును. తెలతెలవాఱుచుండ వాఁడొడలు మఱచి కంకటిపై నొఱఁగి నిద్దురపోవును. చిత్తి చెవులు రెండును రేయెల్ల చిత్కళ

కుటీరద్వారముననే వ్రేలాడుచుండును. చిత్కళ తలుపుతెఱచు చుండఁగనే అవి తుఱ్ఱున నెగిరిపోయి, తాము విన్నదంతయుఁ జిత్తికి విన్నవించును. ఆమె కావగింజంతయు నర్థముగాదు. అదియేమో వింతబాస. ఆబాస తన మగఁడెప్పుడు నేర్చెనో!

చిత్కళ కృష్ణపక్షమంతయు నుపవాసములే యుండెను. శుక్ల ప్రతిపదుదయమున నామెకుఁ దన కొమ్మక్రింద గుప్పెఁ డన్న గుప్పెఁడు పూలు దొరికెను. ఆ పూలు కొంగునముడిచి కొని యామె సుమంతపురమునకుఁ బోయెను. వణిజుఁ డామెను బలుకరించెను. "ఏమమ్మా! పదునైదు దినములై కంటికే కనఁబడకపోతివి. నీ వంతుసరకులుగూడ నవతినే తెచ్చు కొమ్మంటివా యేమి?" చిత్కళ చిఱునవ్వునవ్వుచు నిట్లనెను. "ఆ కొమ్మకు నాపైఁ గోపము వచ్చినది గావలయును. ఈపక్ష మంతయు నొక్క పూవేని విడువలేదు. ఇన్నాళ్ళకీనాఁడీ గుప్పెఁడుపూలు విడిచినది. దీని కెంతవచ్చిన నంతేయిమ్మా" ఇట్లనుచుఁ గొంగు ముడివిప్పి యాగుప్పెఁడు పూలను గోమటి దోసిటఁబోసెను. కోమటికిఁ గన్నులు చెదరిపోయెను. ఇవి ఏమి పూలు!

వణిజుఁడామె వంక వింతగాఁ జూచుచు లోనికిఁబోయి గంపనిండ సరకులెత్తి గంప నామె నెత్తికెత్తి "మరల నెన్నా ళ్ళకు వత్తువో?" అనెను. "ఎప్పుడు గుప్పెఁడు పూలు దొరకిన

నప్పుడే వత్తునుగదా''. యనుచు నామె యింటికి బయలు దేఱెను.

శుక్లపక్షము సగపడునప్పటికి చిత్కాళ కుటీరము సరకులతో నిండిపోయెను. చిత్తికిఁ బిచ్చియెత్తి నట్లుండెను. అది యొకనాఁడు ''ఏమయ్యా సెట్టీ! దానియందు నీకింత పక్షపాత మెందుకు ? గుప్పెడుపూలకే గంపెడుసరకు లిచ్చుచుంటివి! దానిపూలేమి పైఁడిపూలా ?'' అని తగవులాడెను. ''ఏమి పూవులో నీవే చెప్పుము'' అని యా వణిజుఁడు లోనికిఁ బోయి దోసెఁడు బంగారుపూలు దెచ్చి చేటలోఁబోసి మెఱపించెను. చిత్తి కన్నులు జిగేలుమనెను. అది గంపనెత్తికెత్తుకొని గబగబ మగనిమీఁదికి దండు వెడలెను.

"దక్షిణపుకొమ్మ దండిగాఁ బూయుచున్నది. ఉత్తరపు కొమ్మ వట్టిపోవుచున్నట్లున్నది. రెండవ యామెకుఁ దిండి జరుగుచున్నదో లేదో! పాపము. రేపటినుండి దక్షిణపుకొమ్మ దానికిమ్ము. ఉత్తరపుకొమ్మ యున్న నాకుఁ జాలునులే'' అని చిత్తి యా రాత్రి మగనికిఁ జెప్పి యొప్పించెను. చిత్తి మగని చెవిలోఁ జేసిన మంత్రాంగము నెవ్వరుపోయి యిప్పచెట్టునకుఁ జెప్పిరో! కుడికొమ్మయు నెడమకొమ్మయుఁ గూడఁ బలుకుకొన్నవి. ''పైఁడిపూ లొక పది దినములు నీవు పూఁచితివికదా. ఒక పది దినములు నేను పూతును'' అని కుడికొమ్మ యెడమ కొమ్మనడిగెను. ఎడమకొమ్మ యట్లే కానిమ్మని యొడంబడెను.

మఱునాఁ డుదయము చిత్కళ వచ్చు నప్పటికి చిత్తి యుత్తరశాఖ క్రింద పూలన్నియుఁ బ్రోవుచేసి యొక్కొక్క దానినే యెంచి పరీక్షించుచుండెను. చిత్కళ యేమియు నెఱుగ నట్లు తన పూజలో, అభిషేకములోఁ దానుండెను. వెదకి వెదకి చిత్తికి విసుగెత్తి పోయెను. చిత్కళ తన కంటె ముందే బంగరుపూల నేఱికొనిపోయి యుండునని చిత్తి కనుమానము దగిలెను. అది బిగ్గరగా నిట్లు సణుఁగుకొనెను. "కొంగ జపములు చేసిన మాత్రమున దొంగ బుద్ధు లెక్కడికిఁ బోవును? రేపు నా కొమ్మ క్రింద పూవు ముట్టినదాని నడుము విఱుగఁ గొట్టుదును."

"ఇది మగనితోఁ జెప్పి యెడమకొమ్మ నడిగి పుచ్చికొన్నది గావలయును. పసిఁడిపూలను పసిఁగట్టినట్లున్నది. బడరునకు ఎడమ యేమి? కుడి యేమి?" చిత్కళ కుడికొమ్మ క్రింద నిలఁబడి "బడరా! బడరా!" అనుచు పైఁట కొంగొడ్డి పట్టెను. కుడికొమ్మ పైఁడిపూల జడి గురిపించెను. ఒడి ముడిచికొని చిత్కళ శివలీలలు పాడుకొనుచు సుమంతపురమునకుఁ బోయెను. సంచినిండ సరకు లెత్తించి సెట్టి చిత్కళ కొఱ కెదురు చూచుచుండెను. చిత్కళ యొడి విడిచి చేటలోఁ బోయుచు "సెట్టీ! నా కొక చిన్నపని చేసిపెట్టుదువా?" అనెను. సెట్టి చేటంత కన్నులు చేసికొని "పనికేమున్నది? బంగారమువలె చేసి పెట్టుదును. చెప్పు తల్లీ! చెప్పు" అనెను. "శబరపతి

శిరమునకీ బంగారముతోఁ గిరీటము చేయించి పెట్టవలెను" అని చిత్కళ పలుకఁగా సెట్టి "అది యెంతపని? రేపిపాటికిఁ దయారు చేయింతును. కాని........" యనుచు నేదో నీరు నములుచు నూరకుండెను.

"ఏమి సందేహించుచుంటివి ? బంగారము చాలదనియా?"

"బంగారము లెక్కయేమి ? కావలసిన గంపలతోఁ దెచ్చి పోయుదువు. అది కాదు తల్లీ! గళమున శివలింగము దక్క నీ మేనఁ జిన్న మెత్తు నగలేదే. లేదని నీకు వగలేదే. నీ మగని శిరమునకుఁ గిరీటము గావలసివచ్చినదా యని"

చిఱునగవు తన మొగమునకుఁ దొడవుగాఁ జిత్కళ "మగనాలికి నగలన్నియు మగఁడేకదా ! కిరీటము మాట మఱువకుమా" యనుచు శబర వాటిక బాటపట్టెను.

మధుకవృక్ష మూలమున మొలిచిన మహావల్మీకమే మధుకేశ్వర దేవర గుడిగోపురములు. ఒక శిలాఫలకమాగుడికి తలుపు. అగ్నిస్వామి యొక పెద్ద ప్రమిదలో నఖండదీపారాధనముఁ గావించి వల్మీకద్వారమునం దుంచెను. లింగోద్భవ కాలము సమీపించుచున్నది. శబరులందఱు నూపిరి బిగఁబట్టు కొని వినుచుండిరి. అగ్నిస్వామి మరలచెప్ప నారంభించెను.

---

యువరాజునకుఁ గన్నులఁ జేతులలో నఱకాళ్ళలోఁ మొలిచి యవియే యాయనకుఁ దెరువుఁ జూపుచుండెను. కాఱడవికిఁ దెరువేడ? కటికిచీఁకటికిఁ దెన్నేడ? కాలమిట్లె యట్లెఁ గడచిపోవుచుండెను. దారి మాత్రము ఎంతకును దఱుగునట్లు లేదు. ఆయన కడవియంతయుఁ జుట్టి వచ్చుచున్నట్లనిపించెనే కాని నిజమున కాయన తన చుట్టుఁ దాను తిరుగుచుండెను.

అగ్నిస్వామి చెప్పుచుండెను :

మఱునాఁడు చిత్తి రేయెల్లచెట్టుక్రిందనే కూర్చుండెను. రాలినపూవు రాలినట్లు తనకొమ్మ పూవులన్నియు నేఱి గంపలో వైచుకొనెను. తెలతెలవాఱుచుండఁ జిత్కళ యేటిలో స్నానమాడివచ్చి యనుష్ఠానము ముగించుకొని బడరునిపైఁ బాటలు పాడుచుఁ దనకొమ్మక్రింద నప్పటికప్పుడు రాలిన పూలు పైపైనఁ బ్రోవుఁజేసి గంపలో వైచికొని గంప చంకనిడికొని పురమునకు బయలుదేఱెను. చిత్తికూడ తన గంప నెత్తి నిడుకొని యామెవెంటఁ దానును బయలుదేఱెను. చిత్కళ యొద్దు దిగినది. చిత్తి యొద్దుననే యున్నది. దాని కన్నులు ఒక్కగంతునఁబోయి చిత్కళ గంపలోఁ గూర్చుండెను. గంపలోని కనకంపుఁబూలు కందిరీగలవలె ముసరి దానికన్నులలోఁ జిటుకుచిటుకున నంటఁబొడిచెను. చిత్తి కొడలెల్ల కంపర మెత్తెను. నెత్తిమీఁద పూలగంప నిలువఁజాలక తూలిపోయెను. నేల

రాలిన పూలప్రోవును చిందరవందరఁ జేయుచు చిత్తి నిప్పులు త్రొక్కిన కోఁతివలెఁ జిందులు త్రొక్క నారంభించెను.

చిత్కళ కీ సంగతియే పట్టలేదు. ఆమె చిత్తమంతయు సుమంతపురమున సెట్టియింట నుండెను. కిరీటమును జూడవలె నని యామె చూపు లామెముం దుఱకలువేయుచుండెను. శిలమీఁదినుండి శిలమీఁదికి చెంగుచెంగున దుముకుచు నామె చిటికలో ళేడిదాఁటులు వెట్టుచు నేటియావలిగట్టున ప్రాలెను.

"సెట్టికి దీనిపైఁ బఱపాతమనుకొంటిని. సెట్టికిఁగా దీచెట్టు నకే పుట్టినదీ చెట్టబుద్ధి. కానిమ్మిప్పుడే దీనిపని పట్టించెదను." చిత్తి పండ్లు పటపటఁ గొఱుకుచు, కండ్ల మిణుఁగురులు గురి యుచు బారెఁడు పొడవు బడితె చేతఁబట్టుకొని యిప్పచెట్టు మీఁది కెగఁబడెను. చిత్తినిగాంచి చెట్టు గడగడలాడిపోయెను. అప్పుడే వచ్చి పుట్టచాటునఁ గూర్చుండిన చిత్రగాయకునితోఁ జెప్పికొందమన్నను వాఁడేమి యార్పఁగలడా, తీర్పఁగలడా! చిత్తి దాడికిఁ దట్టుకొనలేక వాఁడే తనగోడు చెట్టుతోఁ జెప్పి కొనును. చిత్తి చేతిలోని దుడ్డుకఱ్ఱ సవరించెను. చెట్టునకుఁ జెమటలు పట్టెను. చిత్తి దుడ్డుకఱ్ఱ రెండుచేతులతోఁ బైకెత్తెను. చెట్టు మొదలంటఁ గదలి నిలువెల్లఁ గంపించెను. జలజల పూలు గురి పించెను. ఎత్తిన కఱ్ఱ క్రిందికి దించి చిత్తి మనస్సులో నను కొనెను. "దెబ్బకు దయ్యము దౌడుతీయును. నీవు కురియు దువా నీ యబ్బ కురియునా? బంగరుపూలకొఱకు లింగము

గట్టుకొనివత్తు ననుకొంటివా ?" చేతికఱ్ఱ క్రిందఁబెట్టి చిత్తి చెట్టుక్రిందికిఁ బోయి రాలిన పూల నేఱిచూచెను. పసిఁడి పూవు లెక్కడ ! అవి వట్టి పసరుపూవులు !

చిత్తి కఱకాలిమంట నెత్తి కెక్కెను. ఒడలెల్ల గంగ వెఱ్ఱు లెత్తెను. బడితె పుచ్చుకొని యెడమకొమ్మను, గుడి కొమ్మను బడబడ నాలుగు బాదెను. చెట్టుక్రింది పుట్టచాటునఁ గూరుచుండిన చిత్రగాయకుఁ డదరిపడి చూచెను. చిత్తి కెందు లకో శివమెత్తినది. దీనికేమి పోఁగాలము ! పసరుపూలన్నియు రాలఁగొట్టుచున్నది !

"ఓసీ ! చిత్తి యన్న నేమనుకొంటివి ? ఇప్పటికైన బుద్ధిఁ దెచ్చుకొనుము. ఇంతటితోఁ దీఱినదనుకొనకుము. రేపు వచ్చిచూతును. బుద్ధి తెచ్చుకొంటివా బ్రతికిపోదువు. లేనిచో నటికి ప్రోవులుపెట్టుదును. నాకొకపట్టునఁ బిచ్చియే యెత్తదు. ఎత్తెనా యీశ్వరుఁడు దిగిరావలసినదే" చేతిలోని ధుడ్డుకఱ్ఱ నావల విసరివైచి, చెదరిపోయిన జుత్తు నడినెత్తిన ముడివైచు కొనుచుఁ జిత్తి కొలిమితిత్తులవలె డొక్కలెగురవైచుచుఁ జూపు లలో నిప్పులు చెరుగుచుండెను. దాని కింకను కసితీఱలేదు గావలయును. పాఱవైచిన బడితెకై తడవుకొనుచుండెను. చిత్రగాయకుఁ డొక్క పరుగున దానిపై కుఱికి కాలుసేతు లొడిసిపట్టి మూటఁగట్టి మూఁపుపై వైచుకొని "నీకేమి వెఱ్ఱి యెత్తినదా ? బంగారమువంటి చెట్టును బాడుచేయు సమ్మకట్టి

తివి ?" అనుచు గుడిసెదిక్కునకు నడచిపోయెను. అది వాని వీపున వ్రేలాడుచు నడవిపందివలె గుఱ్ఱువెట్టుచుండెను. చిత్రి గాయకుఁడు చిత్తిని గుడిసెలోఁ గూలవైచి గుమ్మమునకు గడియవైచి తిరిగివచ్చి చెట్టుమొదటఁ గూర్చుండి మురళి వాయించుకొనుచుండెను.

చిత్కళ కిరీటము నోడిలో ముడిచికొని మాఘమాస మధ్యాహ్నపు మిడిమిడి యెండలో సుమంతపురమునుండి ఱెక్కలపై నెగిరివచ్చుచుండెను. మగని మురళీగాన మామెకు వంశధారాతీరమున నెదురుపడెను. ఆ గానము వెంటఁబడి యామె మధుకవృక్షముక్రింద వల్మీకమూలమునఁ గూరుచుండిన చిత్రిగాయకుని మ్రోల నిలిచెను. తాను ఏడాది క్రిందటి రేపటి దినమున వచ్చెను. కాని యామెకు తానప్పుడే వచ్చినట్లుండెను. చిత్రిగాయకుఁ డింకను నామెవంకఁ జూడలేదు. ఆమె చెట్టుక్రింద చితచితలాడుచున్న పసరుపూవులు పరికించి యబ్బురముతోఁ దలయెత్తి చెట్టువంకఁ దిలకించెను. చింపిరి తలతో నా చెట్టు చిత్కళవంక దీనముగాఁ జూచెను. చిత్కళ మొగము చిన్నఁబుచ్చుకొని చిత్రగాయకుని చేతితోఁదట్టి తెలివి పుట్టించి "పాపమీచెట్టున కిట్టి గతి పట్టినదేమి?" అని ప్రశ్నించెను. చిత్రగాయకుఁడు తాను జూచినంతవఱకు నామెకు వర్ణించి చెప్పెను. ఇరువురు గుటీరమునకు బయలుదేఱిరి. దారిలోఁ జిత్కళ చెట్టు పూలన్నియుఁ జిత్తియే యెత్తుకొనిపోవుట, బడ

రుఁడు తన దిక్కున బంగరుపూలు గురియుట లోనుగాఁగల వృత్తాంతమంతయుఁ బూసఁగ్రుచ్చినట్లు మగనికిఁ జల్లఁగాఁ జెప్పుకొని వచ్చెను. చిత్రగాయకుఁ డంతయు వినుచుండెను. వినుచున్న కొలఁది వాని కడుపులోఁ జేయివెట్టి కలచినట్లేదో కలవరము బయలుదేఱెను. వాని చిత్తము వేయిశకలము లయి నట్లుండెను. కుటీరమునఁ బ్రవేశించి వాఁడు కంకటిపై గూలఁ బడెను. వాని కచ్చటనుండ బుద్ధి పుట్టుటలేదు. ఎక్కడులున్నచో నెక్కడికేని ఎగిరిపోవలెననిపించెను. వానికిఁ జిత్కళపైఁ గోపమువచ్చెను. చిత్తిపై నంతకంటెఁ గోపము వచ్చెను. సవతుల నడుమ రవరవలు పుట్టించిన చెట్టుపైఁ బట్టరాని కోపమువచ్చెను. "ఈ చేటున కంతటికి ఈ చెట్టేకదా కారణము. దీనిని నఱికి పాఱవైచినచోఁ బీడవదలిపోవును" అని యాతఁడు చివాలున లేవఁబోయెను. చిత్కళ యాతనిని గూర్చుండఁబెట్టి యా మాట యీ మాట యాడి యలుక మఱపించెను. ఆ పాట యీ పాట పాడి గంధర్వలోకముఁ దెఱపించెను. కిరీటము శిరమునఁబెట్టి చిత్రసేనుని రూపము మెఱపించెను. "ఆ చెట్టు వట్టిచెట్టు కాదు. అది పరమేశ్వర నివాసము. ప్రత్యక్షకైలాసము. ఆ పుట్ట వట్టిపుట్టకాదు. పరమేశ్వరుని సింహాసనము. నందీశ్వరుని శీర్షము." నీలపాత్రికలోని దీపకళికవలె చిత్రగాయకుని శరీర మునందొక విచిత్రమైన కాంతిపుంజము వెలుఁగసాగెను. చీఁకటి

కుటీరమున వాని శీర్షమందలి కిరీటమూ దీపశిఖవలె మెఱసిపోవు చుండెను.

యువరాజు ఒకక్షణమాగి కన్నులు దెఱచి నలుగెలంకులం బరికించెను. అల్లంతదూరమున మినుకుమినుకుమను వెలుఁగు కనిపించెను. ఆ వెలుఁగును గన్నులలోఁ బెట్టుకొని యాయన నడక సాగించెను. ఆ దిక్కున నేవో పలుకులు వినిపించెను. ఆయన యింక దారికొఱకుఁ దడవుకొనలేదు. ముక్కునకు సూటిగాఁ ద్రొక్కుకొనిపోయెను. "మధుకవృక్ష మూలమునఁ గూర్చుండినవాఁడు శబరపురోహితుఁడు గావలెను. శిరముల నెమలియీకల కిరీటములతో నేదుపందులవలె కూర్చుండిన వీరం దఱు శబరనాయకులు గావలయును. ఇది పుళింద సేనుని రాజ్యమా ? అవునిది ముఖలింగక్షేత్రమే! ఓహో! నేఁడు మహా శివరాత్రి పర్వదినము. పరమేశ్వరుని కరుణవలన నాకీనాఁ డుప వాసము, వంశధారాస్నానము, లింగోద్భవ సందర్శనము సిద్ధించినవి."

యువరాజు నిశ్శబ్దముగ నొక వృక్షమూలమునఁ గూర్చుండి యగ్నిస్వామి కథనము నాలకించుచుండెను.

"నేఁడు మాఘ బహుళ చతుర్దశి. మహాశివరాత్రి పర్వ దినము. పరమేశ్వరుఁడు నేటి యర్ధరాత్రమున లింగాకారుఁడై యుద్భవించి భక్తులకు నయనపర్వముఁ గావించును. నేఁడు ప్రాణిలోకమంతయు బాహ్యాంతరములఁ బరిశుద్ధమై పరమే

శ్వరాయత్తచిత్తమై యుండును. అట్టి చిత్తమున నీశ్వరుని జ్యోతిర్లింగమూర్తి దేదీప్యమానముగ గోచరించును. నేఁడు నీకును నాకును నిట్రుపాసము. మధురసము మాటఁ దలపెట్ట రాదు. మంచినీరు కూడ ముట్టరాదు. ఏటినీటఁ దానమాడి మధుకవృక్ష మూలమునఁ బద్మాసనమునఁ గూర్చుండి యోం కారము నుచ్చరింపుము. పంచాక్షరి జపింపుము. లెమ్ము. వంశ ధారకుఁ బోదము.''

చిత్కళ మగనిచేయి పట్టుకొని యా జిలుగుచీఁకటులు దాఁటించి యేటియొడ్డునకుఁ దోడుకొని పోయెను. తెలినీటఁ దొలితాన మాడించెను. ఒడలెల్లఁదడి యొత్తెను. వెలిబూది మలితాన మాడించెను. కురులు పిడిచి నడినెత్తిన ముడివైచెను. చేయి పట్టుకొని యిప్పచెట్టు క్రిందికి నడిపించుకొని వచ్చెను. చితాగ్నిసనమునఁ బుట్ట కెదురుగాఁ గూర్చుండఁ బెట్టెను. చెంతఁ గూర్చుండి చెవిలోఁ జల్లఁగా శంఖము పట్టెను. ఆ శంఖనాదము వాని హృదయాంతరాళమున వలయములు తిరిగి తరంగము లుగా నుప్పొంగి వాని ముఖమునందు "ఓం" కారమై ముఖ రించెను. ఆ యోంకారము వల్మీకగర్భమున మధుకోశ రసపాన పరవశములై యున్న మధుమక్షికముల కొడళ్లు తెలిపించెను. అవి జుమ్మని రేఁగి మధుకవృక్షమునకుఁ బ్రదక్షిణము తిరుగుచు నోంకారము చేసెను. ఆ యోంకారము వంశధారాతరంగము లను మేలు కొలిపెను. ఆ తరంగములు గండశిలాలింగముల

చుట్టు సుడులు తిరుగుచు నోంకారము చేసెను. మధువనమం తయు మేలుకొని యోంకారము చేసెను. మహాకాంతార మంతయు నోంకారము చేసెను. భూతధాత్రి యంతయు నోంకారము చేసెను. గగనాంతరాళమంతయు నొకే మహాశంఖమై యోంకారనాదము చేసెను.

మగఁడు తన్ను మూటఁగట్టి గుడిసెలోఁ గూలవైచి తలుపుగడియ బిగించి తన దారిని తాఁబోయెను. పోయిన వాఁడు తన మాటయే మఱచిపోయెను. చిత్తికిఁ గడుపులో నలుకతుకతుక నుడికి పోవుచుండెను. నడిరేయి కాయలుక యాఁకలియై మండుకొనిపోయెను. కోపము దీఱ నది కుండ లోని యిప్పకల్లు కుత్తుకదాకఁ గ్రోలి యొడలిపైఁ దెలివితప్పి గుడిసెయంతయుఁ బొరలాడి చిట్టచివర కొక మూల ముడుచు కొని నిద్రలో మునిఁగిపోయెను. కల్లు కంపునకు దానిమేనెల్ల ఈఁగలు ముసిరి జుమ్మని రొదఁ జేయసాగెను. దాని కాయమం తయు నొక పెద్ద తేనెతుట్టెవలె నుండెను.

మట్టమధ్యాహ్నమున దానికిఁ దెలివి వచ్చెను. ఒడలు విదలించుకొని, గడియ పెకలించుకొని యది గుడిసెబయటఁ బడెను. పైఁడిపూలు దాని తలఁపున ముసరుకొనెను. అది యొడలు విఱుచుకొని, యొక్కయెదుటున విప్పచెట్టు కడకుఁ బరువిడి వచ్చెను.

చిత్తి పరువెత్తుకొనివచ్చి చెట్టుక్రిందఁ జూచెను. అది యంతయు నొక మహాశ్మశానమువలె నుండెను. తల యెత్తి చెట్టువంకఁ జూచెను. అది యొక మహాకంకాళమువలె నుండెను. తల దింపి పుట్టవంకఁ జూచెను. అది యొక పునుకల గుట్టవలె నుండెను. పుట్ట యెదుటఁ జూచెను. భసితావలిప్త సర్వాంగుఁడై ఛర్మకిరీట ప్రభాభాసమానోత్తమాంగుఁడై, పద్మాసనమునఁ గూర్చుండి ప్రణవనాదము చేయుచున్న చిత్రగాయకుఁడు! ఎవఁడీ బూడిదబుంగ? ఎవఁడేమి? తన మగఁడే! కట్టుకొన్న యిల్లాలిని గాలుసేయి గట్టి గుడిసెలోఁ గూలవైచి యీ చెట్టు క్రిందఁజేరి కొంగ యపులబచుచుండెను.

చిత్తి కోడలు మండిపోయెను. మొగము మాడి మంగల మయ్యెను. కన్నులు చూడి యింగలములయ్యెను.

"ఔరౌరా! జంగముదాని సంగాతము పట్టి నీవుకూడ ఈ దొంగజపములు మొదలుపెట్టితివా? ఉండుముండుము. నీ సంగతియు, నీ జంగమసాని సంగతియు నిప్పుడే తేల్చెదను. సెట్టిని దిట్టి యేమిలాభము? చెట్టును గొట్టి యేమిలాభము? కపటమంతయు నీలో నున్నది. చల్లని కొంపలోనికి చెల్లెలని చెప్పి యీ చిచ్చుఁ దెచ్చిపెట్టితివి. పండువంటి సంసారము రెండుగాఁ బగులఁగొట్టితివి. తిండిలో సగమంటివి. గుండెలో

సగమంటివి. వెన్నెలరేల నన్నుఁ జీఁకట్ల ముంచితివి. చీఁకటి రేల దానిని వెన్నెలలఁ దేలించితివి. దాని వలలోఁ జిక్కి నా వలపు మఱచితివి. నా మనస్సు విఱిచితివి. కాలుద్రొక్కి తాళిఁ గట్టిన యిల్లాలిని కాని దాననైతినా ? దారినఁబోవు జంగమ సాని నీ కేనాఁటి చుట్టము? అది యూరక ఇంతదూరము వచ్చి నదా ? చిత్తి సంసారమునఁ జిచ్చుపెట్ట వచ్చినది. నీవు వట్టి యమాయికుఁడవు. నీకు నల్లనివి నీళ్లు, తెల్లనివి పాలు. చెలిమి మాటలతో నన్నే యది వలలో వైచుకొన్నది. నీ మాట యింకఁ జెప్పనేల ? నీ మేనిపై నేమి మచ్చులు చల్లినదో ! నీ వీనులలో నేమి మంత్రము లూదినదో ! నీ కన్నులకే మాయ లోకములు జూపించినదో! అయ్యయ్యో! ఎంత మొత్తుకొన్నను ఉలుకవు పలుకవు. నాపైఁ జలమూనితివో ! వలపుమానితివో ! చిత్తియే నీకు జీవమంటివి, చిత్తితోడిదే లోకమంటివి. చిత్తి వంక కన్నెత్తి చూడవేమి ? చిత్తితోఁ బల్లెత్తి మాటాడవేమి ? చిత్తిపై నీకు మొగము మొత్తినదా? నా కంటికాటుక రేకవు. నా కుత్తుక నల్లపూసవు. నా మేని కస్తురిపూఁతవు. నాపై నలిగితివా ? తలతలలాడు నెమిలి యీఁకల తలపాగ తొలఁగించి నీ తలపై నీ మాయబంగారపు బొమిడికముఁ దొడిగినదా ? గమగమలాడు కస్తురిపూఁతలు గడగివేసి నీ యొడలినిండ నీ వెలి బూడిదఁ బులిమినదా ? నా యొడిలో నిగనిగలాడు నీలాల బొంగరమవు. జంగమసాని మాయలోఁ బడి పటికఱా లింగమ

వైతివా ? అయ్యో నా సామీ ! కాలుసేయి గదలింపవు. కనులు విరిసి పరికింపవు. ఓ యని యొకచే యఱతువు. నోఱు నొవ్వదా సామీ ! శబరుఁడవై పుట్టినావు. శబరిని చేపట్టినావు. జంగమసతి నీకేటికి ? సవతిపోరు నాకేటికి ? రమ్మా. కుటీరమున కేగి కమ్మని మధురసము ద్రాగి యొకరిమీద నొకర మొరిగి యొడలుమఱచి నిదురింతము.''

ఈ తీరునఁ జిత్తి యొక కంటరౌద్రము నొకకంటఁ గరుణము, ఒకమాటతో వీరము, ఒక మాటతో శృంగారము నొలికించుచు భయంకరమైన మానసిక మహాప్రళయమును బ్రదర్శించుచుండెను. అది యొకసారి భగభగ మండును. ఒక సారి వలవల నేడ్చును. ఒకమాఱు పెళపెళ ఉఱుమును. ఒక మాఱు కిలకిల నవ్వును. తన జుట్టు పీకికొనును. తన యొడలు రక్కికొనును. నెత్తిమీఁద మొత్తుకొనును. గుండెలలో గ్రుద్దు కొనును. చిత్రగాయకుని చుట్టు జిందులు ద్రొక్కుచుఁ దిరు గును. చప్పట్లు జఱచుచు పదములు పాడును. వాని భుజ ములు రెండుచేతులఁ బట్టుకొని వాని మొగములో మొగము పెట్టి పలుకవేమని యదలించును. కదలవేమని కుదిలించును. ఒడల్లెల్లఁ దడవి యెంత బడుగువైతివిరా యని వెక్కి వెక్కి యేడ్చును. వాని శిరముమీఁది కిరీటమును పెఱికి గిరగిరఁ ద్రిప్పి గిరవాటు పెట్టెను. అది పోయి చెట్టు మొదటి పుట్టపైఁ గుదురుగాఁ గూర్చుండెను. చిత్తి గిర గిరఁ దిరిగి మగని

యొడిలోఁ గూర్చుండెను. "నా మగఁడు, నా మగడు" అనుచు వాని చేతులు తన నడుమునకు బిగించుకొనెను.

చిత్రగాయకుఁడు శంఖమువలె నట్టే యోంకారము పూరించుచుండెను. వెలుపలి యలజడి తాఁకునకు వాని సమాధి చల్లఁగా సడలసాగెను. వానికి ఒడలు సగము సగము తెలియుచుండెను.

సంజె వెలుఁగులు చెట్లసందుల దోబూచులాడుచుండఁ జిత్కళాదేవి కాంచనమణి కేయూరములు కతుమూలముల మెరయుచుండఁ బరుగు పరుగునవచ్చి వృతుమూలమున నిల్చెను. చిత్రగాయకుని కాయమున కృష్ణసర్పమువలె పెనవైచుకొని బుస్సలు కొట్టుచున్న చిత్తిని జూచి యామె మేను జలదరించెను. "అయ్యో! కర్మమా! ఇది మగనిని మరలఁ గాటువేయ లేదు గదా!" చిత్కళ మెల్లఁగాఁ బోయి రెండుచేతులఁ జిత్తి మెడ నొడిసిపట్టి మగని మేనిపట్టు వదలించి దాని నల్లంత దవ్వున విదలించి వైచెను. అది కస్సునలేచి యామె కంఠము వాటువేసికొనెను. చిత్కళ యుక్కిరిబిక్కిరి యయ్యెను. ఆమె యెట్టెట్టులో దాని పట్టు వదలించుకొని దూరముగా నెట్టివైచెను. పతి మస్తకమునఁ గిరీటము, బాహువులఁ గేయూరములు గట్టవలెనని చిత్కళ చిత్రగాయకుని చెంతకు వచ్చి చెదరిపోయిన వాని కురులను నడినెత్తిన ముడువఁబోయెను. చిత్తి వెనుకపాటుగా వచ్చి యామె సిగఁబట్టుకొని లాగెను. చిత్తి

మీఁద చిత్కళ, యామెమీఁద చిత్రగాయకుఁడు దొంతరగా దొరలిపోయిరి. చిత్రగాయకున కప్పుడు పూర్తిగాఁ దెలివివచ్చినది. అతఁడు లేచి నిలిచి చిత్తి చిత్కళలవంకఁ దిలకించెను. వారు మరల జుట్టు జుట్టు బట్టుకొని కలియఁబడి వెలుఁగు నీడలవలె పెనఁగులాడుచుండిరి. చిత్రగాయకుఁడు వారి నడుమఁ దూఁటి యిరువురనుఁ జీలదీసి చెరియొక పక్కకు నెట్టివైచెను. వారు మరల నెగిరివచ్చి యాతని చేతులనుఁ జుట్టుకొని చెరియొక దిక్కు లాగుచుండిరి. అతఁ డిరువురినడుమఁ జిక్కి నిలువఁద్రొక్కు కొనఁజాలక త్రొక్కిసలాడు చుండెను. ఇటు తూలి యటు తూలి చిట్టచివర కాతఁడు చిత్తి చీఁకటిలోఁ గూలునో, చిత్కళ వెలుఁగులోఁ దేలునో! చెట్టునఁ బుట్టిన యీ వైరము తన ప్రాణములకుఁ జుట్టుకొన్నది. చిత్రగాయకుఁడు చెట్టువంకఁ జూచెను. అది జుట్టు విరఁబోసికొని దయ్యమువలె నుండెను. 'ఓసీ! సవతుల నడుమ నగ్గిపెట్టినది నీవు కదా! నీ పని పట్టెద నుండుము.'

చిత్రగాయకుఁడు సవతులను చెరియొక దిక్కునకుఁ ద్రోసివైచి చరచర నడచి గూడెములోనికిఁ బోయెను. గండ్రగొడ్డలి బుజమునఁ బెట్టుకొని గబగబ చెట్టుమొదటికి వచ్చెను. గొడ్డలి పైకెత్తి చెట్టుమొదట నొక్క పెట్టు పెట్టెను.

అగ్నిస్వామి వల్మీకద్వారమున గల శిలాఫలకముపైఁ గొబ్బరికాయ కొట్టి గుప్పెఁడు కర్పూరము వెలిగించి వల్మీకము

నందుంచెను. శబరులందఱును "జయజయ ముఖలింగా! జయ మధుకలింగా!" యని చేతులెత్తి మ్రొక్కికొనిరి.

చిత్రగాయకుఁడు మరల గొడ్డలి యెత్తెను. మఱియొక పెట్టు పెట్టఁబోయెను. చెట్టు మొదటి పుట్ట యాతని రొమ్ములలో గుచ్చెను. ఆతఁ డదరి యల్లంతదూరమునఁ బడెను. వల్మీకగర్భమున నగ్నిపర్వతము బ్రద్దలయినట్లు భయంకరమగు శబ్దము బయలుదేరెను. వృక్షమూలమున గొడ్డటి గంటినుండి భుగభుగ పొగలు గ్రమ్మెను. భగ భగ మంటలు చిమ్మెను. చిత్తికిఁ గాయమెల్లఁ గంపరమెత్తెను. అది గొంతెత్తి పేరు పేరున శబరులను బిలుచుచు నూరిలోనికిఁ బరువెత్తెను. చిత్కళ స్మృతితప్పి పడియున్న పతిశిరము నొడి యందిడుకొని పరమేశ్వరుని ధ్యానించుచుండెను.

చిత్తి యఱచిన యఱపులకు ఆ యర్ధరాత్రమున నాకాశమంతయు నావులించెను. అడవి యంతయు సుడులు తిరిగెను. గూడెమంతయు నిద్దురలో దద్దరిల్లి నడువీధిలోఁ బ్రోగు పడెను. "జంగమసాని నా మగనిఁ జంపుచున్నది. మధుకవృక్షమున మంత్రమువేసి మంటలు బుట్టించినది. జంగమసానిని జంపుడు. శబరనాయకుని బ్రతికింపుఁడు" అని చిత్తి నెత్తి నోఱు గొట్టుకొనుచు గోలపెట్టుచుండెను. చిత్తిమాట నిజమే! మధుకవృక్షమున మ ం ట లు రే గి మింటికంటుచున్నవి. చేతి కందిన సాధనములు బట్టుకొని శబరులు గబగబ చిత్తివెంటఁ

బరువెత్తిరి. చిత్కళ చుట్టుఁజేరి నలుకుదుము చంపుదు మను చుండిరి. చిత్కళ చిత్తమంతయు శివునిపై నిల్పి "కరుణాంత రంగా, కాంచనలింగా, ఆర్తభయభంగా, అమృతలింగా" యని జపించుచుండెను. వల్మీకము ఖణిల్లున అంకెవై చెను. శబరు లం దఱుఁ జకితులై వల్మీకమునఁ జూపులు నిల్పిరి. నందివాహ నుఁడు, చంద్రశేఖరుఁడు, శంకరుఁడు పార్వతీసమేతుఁడై మధుకవృక్షమూలమునఁ బ్రత్యక్షమయ్యెను. చిత్కళాదేవి పార్వతీపరమేశ్వరులను భక్తితో నర్చించి పతిభిక్ష యర్థించెను. శంకరుఁడామెను గరుణించి చిత్రసేనుని పునర్జీవితుని గావిం చెను. శబరులై జన్మించిన గంధర్వులకు శాపవిముక్తి ప్రసాదిం చెను. చూచుచుండఁగనే శబరుల యంగములకు బంగరు రంగు వచ్చెను. వారి మస్తకముల మకుటములు నిలిచెను. వారి కక్ష మూలములఁ గనక పక్షములు మొలిచెను.

చిత్తి కిది యంతయుఁ జిత్రముగా నుండెను. తన చిత్ర శాంఖుకుఁ డేడి ? చిత్కళతోఁ జేరి తనకు దూరమై పోవు చున్నాఁడు. కనక పక్షములఁ గదలించుకొనుచు గగనమార్గ మున గంధర్వలోకమునకుఁ బోవుచున్నాఁడు. తనకింక గతి యేమి ? చిత్తికి దుఃఖ ముప్పొంగివచ్చెను. అది పరమేశ్వరుని పాదములఁబడి వలవల నేడ్చెను. పరమేశ్వరుఁడు దాని నోదార్చి చిఱునవ్వు నవ్వుచు "చిత్తీ ! నిన్నుఁ గైలాసమునకుఁ దీసికొని

పోదును వత్తువా ?" యనెను. చిత్తి శివుని వంకఁ జూచి "కైలాస మనఁగా నేమి ?" యనెను.

"నేనుండు నెలవే కైలాసము"

"నీ విక్కడనే యుంటివిగదా! కైలాస మింకెక్కడ నున్నది ?"

పరమేశ్వరుఁడు చిత్తి చేతిలోఁ జిక్కిపోయెను.

"ఓ సామి ! ఓ సామి ! చిక్కితివిలే. ఇంకెక్కడకుఁ బోదువు ? నా చెట్టునఁ బుట్టిన బంగారుకాయవు. ఈ పుట్టలో నిన్నుఁ బండవేయుదును. కమ్మని వాసనలతో నీ కాంతార మంతయు గమగమ లాడింపుము. ఈ లోకమున కిదియే కైలాసము."

పరమేశ్వరుఁడు చిత్తివంకఁ జిఱునవ్వులు నవ్వుచు మధుకవృక్ష మూలమున నిజరూపము నుపసంహరించెను.

శబరులందఱు 'జయమధుకలింగా జయజయ ముఖలింగా' యని మరల జయవెట్టిరి. అగ్నిస్వామి యా జయనాదములపై శంఖనాదము పూరించెను. శబరు లందఱు చేదివ్వెలు వెలిగించి జేగంటలు మ్రోయించిరి. వల్మీక గర్భమున జుమ్మను నాదము చెల్లరేగెను. వల్మీకాగ్రమునఁ గప్పురపు కమ్మపొగలతో మిల మిలలాడు మిణుగురు లెగజిమ్మెను. ఆ చిమ్మిన మిణుగురు లిప్పచెట్టు రెమ్మలంటి బంగరుపూలు మెరపించెను.

"మధుకవృక్ష మూలమున నుద్భవించిన మధుకేశ్వరుఁడే

ఈ ముఖలింగేశ్వరుఁడు. ఆ శాపముక్తులైన గంధర్వుల సంతతి వారే మీరు. ఆ వామదేవుని సంతతివాఁడనే నేను.'' అగ్నిస్వామి యిట్లు పలుకగా విని శబరు లొకరిమొగ మొగరు చూచుకొనిరి. ముసిముసి నవ్వులు నవ్వుకొని మురిసిపోయిరి.

అగ్నిస్వామి వల్మీక ముఖమందలి శిలాఫలకము దొలఁగించెను. చుట్టలుచుట్టుకొని చుట్టలపైఁ బడగెత్తుకొన్న నల్లత్రాఁచువలె మధుకలింగముపైఁ బుట్ట తేనెపట్టు పట్టియుండెను. కప్పురపు మంటల సెగలకుఁ గప్పురపుఁ బొగల గాటునకు జుంటీగలు జుమ్మని రేగి మధుకవృక్షమున ముసరుకొనుచుండెను. అవి యన్నియు శాపవిముక్తులైన గంధర్వులు గావలయును. క్రమక్రమముగ మధుకేశ్వరుని ముఖలింగాకృతి తేటపడుచుండెను. శబరు లెల్లరు జేగంటలు మ్రోగించుచుఁ జేదివ్వెల నూగించుచు ఆనందోన్మత్తులై యాడఁదొడఁగిరి. గండుతుమ్మెదల ఝుంకారమువలె, కొదమనెమ్మల క్రేంకారమువలె, గున్నయేనుఁగుల ఘీంకారమువలె శబరుల జయజయారావములు మధువనమున మారుమ్రోగి యోంకారములు రూపించెను.

అడుగో మధుకేశ్వరుఁడు ! వాఁడే ముఖలింగేశ్వరుఁడు, స్ఫటికలింగమున దోబూచులాడుచున్నాఁడు. శబరు లందఱును మస్తకములు, కతమూలములు దడవుకొనిరి. వారి మస్తకముల మకుటములు లేవు ! కతమూలములఁ గాంచన పతములు లేవు

"స్వామీ ! మాకు శాపమోచన మెప్పుడు ? అని శబరు లగ్ని స్వామిని ప్రశ్నింతురు. "మధుకవృక్ష మూలమున మహాదేవుని బంధించి చిత్తి యానాఁడు ఈ కాంతారమునఁ గైలాసము మొలిపించినదిగదా ! ఆ చిత్తి సంతతివారు మీరు. మీరీ మధు వనమున నేనాఁడు గంధర్వలోకము వెలయింతురో ఆనాఁడే మీకు ముక్తి !" అని యగ్నిస్వామి శబరులకు సమాధానము చెప్పును.

ముఖలింగ దేవర కెన్నటికిఁ గరుణ కలుగునో యని శబరులందఱు నిట్టూర్పు విడిచిరి. పుళిందసేనుని పురస్సరులై శబరు లందఱు ముఖలింగనికి మ్రొక్కి, మ్రొక్కుబడులు చెల్లించి తీర్థప్రసాదములు స్వీకరించిరి. పుళిందసేనుని వ్యాఘ్రాసనము నలువురు శబరుల బుజములెక్కి రాజకుటీరమునకుఁ బోయెను. ఇంద్రాణి తండ్రికి దారిచూపుచు ముందు నడచెను. ఈ చీకటిలో నేటియావలకుఁ బోవుటా పోకుండుటా యని గుంజాటన పడుచు గర్సడా మెల్లగాఁదన యింటికిఁ బోయెను. శబరులందఱును జల్లచల్లగాఁ గదలిరి. చేదివ్వె లడవి యంతయు జెదరి దవుదవ్వుల మిణుఁగురుఁబురుగులవలె మినుకు మినుకు మనుచుండెను.

శబరులందఱు నెవరిదారిన వారు పోయిన పిమ్మట అగ్ని స్వామి యన్నియు సరుదుకొని యాలయ మూలమున శిలా ఫలకము నమర్చి కరదీపిక వెలిగించుకొని తన కుటీరము త్రోవ పట్టెను.

యువరా జింతవఱకును వృక్షమూలమున నొరిగి మధుకేశ్వర దేవరను మనస్సున స్మరించుకొనుచు మైమఱచి యుండెను. మధుకేశ్వరుని మహిమలు తా నిదివఱకే వినియుండెను. దర్శింపని దోసము తనయందే యున్నది. స్వామి తానై యీ నాఁడు తనకు దివ్యదర్శన మిప్పించెను. దేవర కీ నాటికిఁ దన సేనలు కావలసివచ్చెను గాఁబోలు. ఇంతటి మహిమగల దేవునకీ చెట్టుమూల కాపురమా! స్వామికి గుడిగోపురములపై గోరిక పుట్టినట్లున్నది. కోరికోరి నన్ను తన సన్నిధికిఁ జేరఁదీసి కొనినాఁడు. యువరాజు కలలో ముఖలింగ దేవరకుఁ గోవెల వెలసెను. కోవెలచుట్టు ప్రాకారములు రేఖలు తీరెను. ప్రాకారముల నడుమ ప్రాసాదములు బారులు తీర్చెను. మధుకవనమున మహానగరము అవతరించుచుండెను. అమరపుర ప్రతిస్పర్ధి యగు దంతపురమును గాలఁదన్ను ముఖలింగ నగరము యువరాజు భావనా ప్రపంచమున మూర్తీభవించుచుండెను.

అగ్నిస్వామికి కరదీపికల వెలుగులోఁ గట్టెదుట చెట్టుక్రింద పూచిన మోదుగుకొమ్మ గదలినట్లనిపించెను. ఏమదప్పుక్తెన్నుఁగో

యీ మోదుగుకొమ్మ నిట విఱిచి పారవైచినది కాఁబోలు. అగ్నిస్వామి చెదరిన చూపులు పదిలపఱచుకొని మఱియొకసారి పరికించెను. అది మ్రానికొమ్మ కాదు. మానిసిబొమ్మయే. ఎవరీ మానిసి ? అగ్నిస్వామి కరదీపిక వెలుగున నా మానిసి మొగము పరిశీలించెను. ఆశ్చర్యమున నా పాదమస్తకము కంపించి పోయెను. కళింగాధిపతి - యువరాజు - ఇంద్రవర్మ ! అగ్నిస్వామి భగ్నకంఠమున "ప్రభూ! ప్రభూ!" అని పలుకరించెను. కరదీపికా కిరణములు కనుఱెప్పలపైఁ జురుకునఁ బొడిచి ప్రభువు కన్నులు తెఱపించెను. "ఈ మధుకాంతారమున, మధుకేశ్వరదేవుని సమక్షమున నా ప్రభుతఁ జెల్లించుచున్న ఈ పురుషుఁ డెవ్వఁడు ?" ప్రభువు అగ్నిస్వామి మొగము దిలకించి "బ్రాహ్మణోత్తమా ! గంగామల కులతిలకుఁడు, మిత్రవర్మ మహారాజు సంతానము, ఇంద్రవర్మ ప్రణమిల్లుచున్నాఁడు" అని వంచిన యౌదలపైఁ జేతులు జోడించి నమస్కరించెను. అగ్నిస్వామి ప్రభువునకు స్వస్తిపలికి "ప్రభూ ! ఏమి-యీ విపరీతము ?" అనెను. ప్రభువు నిట్టూర్పు విడిచి "మధుకేశ్వర దేవర విలాసము. నాకు దేవర తీర్థప్రసాదములు దయచేయుం పుఁడు" అనెను.

అగ్నిస్వామి ప్రభువునకుఁ జేయూత యిచ్చి లేవదీసి మెల్లమెల్లన నడిపించుచు వల్మీకము కడకుఁ దీసికొనిపోయెను.

శిలాఫలకమును దొలఁగించి, చేదివ్వె వెలుఁగున ముఖలింగదేవర దర్శనము చేయించెను. ప్రభువు ముఖలింగేశ్వరుని చరణకమల యుగళమునఁ బ్రణమిల్లెను. తళతళలాడు స్ఫటికలింగమున స్వామి చిఱునవ్వుచుఁ దొంగి తొంగి చూచెను. ప్రభువా చిఱునవ్వులను మల్లెపూల గుత్తులనువలె అంజలియందు స్వీకరించి శిరస్సున ధరించెను. తన శిరస్సునందలి యుష్ణీషమేమైనది? ప్రభువు పదింబదిగాఁ దన శిరస్సును దడవి చూచుకొనెను. ముఖలింగదేవర శిరస్సుమీఁదఁ దేనెటీఁగ లొక్కొక్కటిగా మూఁగుచుండెను. ఆ మూఁగిన యీఁగలగుంపు దివ్వెవెలుఁగున బంగరు కాంతులీనుచుండెను. వాని ఱెక్కలయందలి నల్లని మచ్చలు నీలమణి శకలములవలె నిగనిగలాడుచుండెను. ముఖలింగ దేవర మస్తకమున నింద్రనీల శకల స్థగితమగు స్వర్ణకిరీటము మొలకెంచుచుండెను. ప్రభువు మనస్సునందేవో భావములు పొర్లి త్రికళింగ సామ్రాజ్యమునకు ముఖలింగ క్షేత్రమునఁ బట్టాభిషేకము రూపు కట్టించుచుండెను.

అగ్నిస్వామి యింతలోఁ బరువునఁబోయి యొక కలశముతో వంశధారాజలములు గొనివచ్చెను. కలశమును గంధపుష్పాక్షతలచే నర్చించెను.

"గంగేచ యమునే కృష్ణేగోదావరి సరస్వతి నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధింకురు" అని సర్వపుణ్యనదీ జలములను వంశధారాజలములం దావాహనము గావించెను.

"హర హర హర నమ స్సోమాయ చ రుద్రాయచ నమస్తా మ్రాయచారుణాయచ నమశ్శంగాయచ పశుపతయేచ నమ ఉగ్రాయచ భీమాయచ నమో అగ్రే వధాయచ దూరే వధాయచ నమోహన్త్రేచ హనీయసేచ నమో వృక్షేభ్యో హరికేశేభ్యో నమస్తారాయ నమశ్శంభవేచ మయోభవేచ నమశ్శంకరాయచ మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ"

అని యవసరాభిషేకము గావించెను. "భద్రం కర్ణేభిః శృణుయామదేవాః భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః స్థిరై రంగై స్తుష్టు వాగ్ం స్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః స్వస్తిన ఇంద్రోవృద్ధశ్శ్రవాః స్వస్తినః పూషావిశ్వవేదాః స్వస్తి నస్తార్ క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్దధాతు ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః"

అని శాంతిపాఠము పఠించెను. ప్రభువుచే ముఖలింగ దేవరకు షోడశోపచారములు చేయించెను. ప్రభువునకు తీర్థము ప్రసాదము సమర్పించెను. వల్మీకముఖమున శిలాఫలకమునమర్చి "ప్రభూ! కుటీరమునకు దయచేయుఁడు" అనెను. ప్రభువు ముఖమున ముఖలింగదేవర చిఱునవ్వులు తొంగిచూచుచుండెను. అగ్నిస్వామి కరదీపికను జేతఁబుచ్చుకొని మార్గము నిర్దేశించుచుండ ఇంద్రవర్మ యాయన నిర్దేశించిన మార్గమున నడచుచుండెను.

అగ్నిస్వామి కుటీరద్వారమున నాగి "ప్రభూ! లోనికి దయచేయుఁడు" అనెను. "పురోహితులు ముందు, ప్రభువులు వెనుక" అని ఇంద్రవర్మ చిఱునవ్వు నవ్వుచు ననెను. అగ్నిస్వామి ప్రభువు నీతిజ్ఞతను మెచ్చుకొనెను. కుటీరము ప్రవేశించి "ప్రభూ! దయచేయుఁడు" అనెను. ప్రభువు లోనికిఁ బోయెను. నిర్దిష్టమైన యాసనమునఁ గూర్చుండెను. అగ్నిస్వామి పళ్లెము నిండ ఫలములు, పాత్రమునిండ జలములు ప్రభువు ముందుంచి "ఎప్పుడు భుజించిరో ప్రభువు. కొంచెము ఫలాహారము చేయుఁడు. పిమ్మట విశ్రమింతురు." అనెను. ఇంద్రవర్మ రెండు మూఁడు ఫలములు భుజించి కడుపునిండ జలములు గ్రోలి 'ఇది పుళిందసేనుని రాజ్యముగదా' యనెను.

"చిత్తము ప్రభూ! పుళిందసేనుని భవనము ఇచ్చటికి పరువుదూరము గూడ లేదు."

"మరి నన్నిచ్చటికేల తీసికొని వచ్చితిరి ?"

"అతఁడే ప్రభుదర్శనమునకు వచ్చునుగదా యని".

అగ్నిస్వామి బుద్ధితీక్ష్ణతకు ప్రభువు లోలోన సంతసించెను.

"ప్రభువు చిత్తమయినచోఁ బుళిందసేనుని మందిరమున కిప్పుడే........"

"వలదు వలదు ముఖలింగదేవర తమహృదయమందున్నాఁడు. ఆ దేవుఁ డిప్పటికి త్రోవ చూపించినాఁడు. ఈ రేయి యిచ్చటనే జరుగనిండు."

ఇంద్రవర్మ తను త్రాణము సడలించెను. అగ్నిస్వామి యాయనకుఁ దోడ్పడి దానిని మెల్లగా నొలిచి యావల నుంచెను. ఆయన ధరించుటకు వేఱు వస్త్రముల నిచ్చెను. ఆయన మేనిగాయములను దిలకించి యగ్నిస్వామికి తల గిఱ్ఱునఁ దిరిగిపోయెను. ఒడలమీఁది గాయము లన్నియు నోళ్లు తెఱచి "బాధబాధ" యని యఱచుచున్నట్లుండెను. ఇంద్రవర్మ యుత్తరీయమున నా గాయముల నోళ్లు కప్పి మెల్లగాఁ గంకటిపై నాసీనుఁడయ్యెను. దీర్ఘముగ నిఃశ్వసించి యింద్రవర్మ యిట్లనెను. "విప్రోత్తమా ! ఈ సందేహము నన్ను బాధించు చున్నది ? మీరు సమాధానము సెలవీయవలెను.

"ప్రభు వానతీయవలెను"

"మాతృవాక్యము, పితృవాక్యము - ఈ రెంటిలో నేది యనుష్ఠేయము ?"

"ఉభయమును. సాంసారిక విషయములందు మాతృ వాక్యము. సామ్రాజ్య విషయములందు పితృవాక్యము."

"ఉభయము విరోధించినప్పుడు ?"

"ప్రభువులకు రాజధర్మము లిప్పుడు చెప్పవలెనా ?"

"నేను రాజ్యప్రయోజనమున కంటె స్వసుఖమునకే యెక్కుడు ప్రాధాన్యమిచ్చితిని. నాకుఁ దెలియకుండఁగనే పిత్రాదేశము నతిక్రమించితిని, తత్ఫలమే యీ గాయములు"

"ప్రభూ ! దైవకల్పితమైన మాతాపితృవాక్య విరోధమునకు

ళామేమి చేయఁగలరు? పరితాప ముత్సాహమును భంజించును, ఉత్సాహము ప్రభువులకు మొదటి శక్తిగదా! ముఖలింగదేవర ఆశ్రితపారిజాతము. ఆ దేవర తమ యెడలఁ బ్రసన్నుఁడై చిఱునవ్వులు పోవుట నేను గమనించితిని. ప్రభువులకు సర్వము నచిరకాలముననే సుసంపన్నము గాఁగలదు. రవంతసేపు నిశ్చింతగా విశ్రాంతిఁ గైకొనుఁడు. ఈ మధుకవనము జయంతి క్షేత్రము. తెల్లవాఱుసరికి ప్రభువులకు విజయమార్గములు సహస్రముఖములఁ దెఱచికొని రాఁగలవు.”

ఇంద్రవర్మ యగ్నిస్వామి యాశీర్వచనముల నానతమస్తకుఁడై యవధరించి కంకటిపై నల్లన నెమ్మేను వ్రాల్చెను. ప్రత్యాశాభూయిష్ఠమగు భవిష్యత్తునకుఁ బ్రస్తావనాంగముగా గతమంతయు నొక్కసారి యాయన కన్నుల యెదుటఁ దిరిగి పోయెను.



ఆ కాలమున దక్షిణాపథము బహురాజకమై యుండెను. అపరాంతమున త్రైకూటకులు, చిదియందు కాలచూర్యులు, కోసలమున నళవంశ్యులు, ఉత్తర కళింగమున శైలోద్భవులు, దక్షిణ కళింగమున వాశిష్ఠిగోత్రీకులు, వేంగీయందు విష్ణుకుండినులు, కుంతలమ్ముల కదంబులు రాజ్యములు నిర్మించుకొని యుండిరి. వీని నడుమ వాకాటకులు సామ్రాజ్య నిర్మాణ యత్నమున నుండిరి. వాకాటక హరిసేనుఁడు దక్షిణాపథ సాగరగర్భమున ప్రళయ ఝుంఝువలె చెలరేగి దేశమంతయు నుఱ్ఱూత లూగించెను. అపరరక్త బాహు వనిపించెను.

అతని ధాటికిఁ దట్టుకొనఁజాలక త్రైకూటకులు తల వంచిరి. కాలచూర్యులు పాదాక్రాంతులయిరి. కోసలములలో నళ, కేసరివంశముల కలహములు హరిశేనునికిఁ జక్కఁగా నక్కఱకు వచ్చెను. నళవంశీయుఁడైన స్కంధవర్మ నోడించి హరిసేనుఁడు కేసరివంశీయుఁడగు భవదేవరణ కేసరిని నందివర్ధన పుర సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టెను. ఆతని సోదరి మహా దేవిని పెండ్లాడెను. కొంగొడ మండలమున శైలోద్భవ వంశీయుఁడగు మాధవవర్మసైన్యాభీతుని కొండలపాలు గావించెను. దక్షిణ కళింగమున వాశిష్ఠిగోత్రికుఁడగు అనంతవర్మను నిర్మూలించెను. వేంగీవిష్ణుకుండినుల దాయాద కలహాలములకు బ్రోది

చేసి కుంతలకదంబుల యింటఁ జిచ్చువెట్టి హారిసేనుఁడు తిరిగి వత్సగుల్మపురమునకుఁ బోయెను.

ఇట్లు మహాప్రభంజనమువలె దక్షిణాపథమును జుట్టు ముట్టి దిగ్విజయియై హారిసేనుఁడు రాజసూయము గావించెను. దక్షిణాపథపతి, మహారాజాధి రాజు అను ప్రశస్తి వహించెను.

ఈ విజయములందు మితవర్మ హారిసేనునకుఁ గుడిభుజమై యుండెను. గాంగకదంబకుటుంబ కలహములతో విసిగి మిత వర్మ గాంగవాడిని వీడి యుత్తరమున నెటనేని యొక రాష్ట్రము నిర్మించుకొను నాశతో పసివాఁడగు ఇంద్రవర్మను వెంటఁబెట్టు కొని బయలుదేరెను. వాకాటకుల రాజ్యములలో సంచరిం చుచు పృథ్వీభోజునకుఁ జిక్కెను. పృథ్వీభోజుఁడు మితవర్మను హారిసేనునకు నివేదించెను. ఈ పరదేశ రాజకుమారు లీ రాజ్య మున నేల క్రుమ్మరుచున్నారు ? హారిసేనుఁడు మితవర్మను పరీ క్షించెను. కర్ణరాష్ట్రమున రణరాగుఁడను చాళుక్యుఁడు పల్లవుల తోఁ జేతులు కలిపి స్వతంత్రుఁ డగుటకుఁ గుట్రలు పన్ను చున్నట్లు వినవచ్చుచున్నది. హారిసేనుఁడు మితవర్మను కర్ణ రాష్ట్రము మీఁదికిఁ బంపెను. మితవర్మ రణరాగుని యాట కట్టించి యాతని కాలుసేతులు కట్టి తెచ్చి హారిసేనుని యెదుట నిలువఁ బెట్టెను. హారిసేనుఁడు మితవర్మ భుజముదట్టి 'భళీ' యని మెచ్చెను. ఆయనను దండాధినేతగా నభిషేకించెను. సకల దక్షిణాపథమును దన ఛత్రము క్రిందికి దెచ్చిన యనంతరము

మిత్రవర్మను కళింగముల కధిపతిగా నియమించెను. రణరాగుని సాహసమును మెచ్చి హరిసేనుఁ డాతనిని కుంతలములకు నప రాంతములకు నడుమ వాతాపియందు నిలిపెను.

కాలచక్రము తిరిగిపోవుచుండెను. హరిసేనుఁ డీ మహా సామ్రాజ్యము నెవరికొఱకు నిర్మించినట్లు? హరి సేనునకు మహా దేవివలనఁ బుత్రసంతానము కలుగలేదు. కలిగిన దొక్కయాఁడు బిడ్డ. ఆమెయే జయావళి. తన యనంతరము వాకాటక సింహా సనము నధిష్ఠింపవలసిన జయావళికి హరిసేనుఁడు రాజకుమారో చిత విద్య లన్నియు నేర్పించెను. హస్తిభోజుఁ డామెకు శిక్షా గురువు. హరిసేనుఁడు తన సామ్రాజ్యమును పంచాగ్నులమధ్య మున నిర్మించెను. దక్షిణమున విష్ణుకుండినులు, కదంబులు. అచ్చట హరిసేనుఁడు పెట్టిన దాయాదకలహానలములు రాజి, రగిలిమండఁ జొచ్చెను. వేంగియందు అతఁడు నిలిపిన దేవవర్మ యింద్రభట్టారకునిచేఁ బదభ్రష్టుఁడు గావింపఁబడెను. కుంతల మునఁ దాను మృగేశవర్మ సంతతిని గాదని కృష్ణవర్మ కుమా రుఁడగు విష్ణువర్మను గద్దెపై నుంచెను. మృగేశవర్మ కుమా రుఁడు రవివర్మ తన సోదరి వాసటభట్టారిక నింద్రభట్టారకునకుఁ బెండ్లిచేసి యాతని యండతోఁ గుంతలమున విష్ణువర్మను జంపి తాను రాజ్యము సంపాదించెను. కాలచూర్య ప్రతాపశీలుఁడు గొప్ప గజబలము సమకూర్చుకొని తానేల దక్షిణాపథ పతిగాఁ గూడదని మీసములు మెలివేయుచుండెను. అనిరుద్ధపురమున

త్రైకూటకులు మరలఁ దలయెత్తసాగిరి. కొంగొడ మండలాధిపతి సైన్యాభీతుఁడు మహేంద్రగిరిపై నెప్పుడు కాలు పెట్టుదునాయని తహతహలాడు చుండెను. హరిసేనుని దక్షిణాపథపతిత్వము ప్రతిక్షణ పతన భయాస్పదమై యుండెను.

నిరంతర సమర వ్యవసాయాయాసమునకుఁ దోడు వార్ధక్యముగూడ కూడివచ్చి హరిసేనుని శరీరమునకు, దానితోపాటు వాకాటక సామ్రాజ్యమునకు శైథిల్యము సంపాదించుచుండెను. ఇంద్రభట్టారకున కిది యాశాజనకమయ్యెను. తానేల దక్షిణాపథపతికారాదు? అందులకు రెండు మార్గములున్నవి. ఒకటి జయావళి. రెండవది చతుర్దంతి. హరిసేనుని పెదతండ్రి పృథ్వీసేనుఁడు వాకాటక రాజ్యమున సామంతరాజుల విప్లవము చెలరేగగాఁ దన తాతయగు మాధవవర్మకు తన చెల్లెలు ప్రిభావతి నిచ్చి పరిణయము గావించి యాయన సాయమున మునిగిపోనున్న సామ్రాజ్యమును ఉద్ధరించుకొనెను. హరిసేనునకుఁ బెడబుద్ధి పుట్టినది. తన సోదరియగు చారుదేవిని మితవర్మ కిచ్చి యాతనిని కళింగములందు నిలిపెను. ఈ మితవర్మ యిప్పుడు తన సామ్రాజ్యమును గాపాడునా? అంతతో నూరకుండక తన కూఁతురు జయావళిని ఇంద్రవర్మ కిచ్చునఁట. ఈ క్రొత్త చుట్టములపై హరిసేనున కింత మమకారమా? జయావళిని దన కిమ్మని ఇంద్రభట్టారకుఁడు హరిసేనునకుఁ గబురంపెను. వాకాటక విష్ణుకుండిన వంశముల సంబంధము నేఁటిది

కాదు గదా. హరిసేనుని యధికారమద మెంతవఱకుఁ బోయి నది? తానై కన్య నర్పింపవలసినవాఁడు స్వయముగా నింద్ర భట్టారకుఁడు కబురు చేయగాఁ దిరస్కరించినాఁడు. ఇంద్రభట్టా రకుని కొక కాలుసోట్ట యఁట. ఔరా! హరిసేనుఁడు కోరి కోరి యింద్రభట్టారకునితో వైరము గొనితెచ్చుకొనినాఁడు. కొరవితోఁ దలగోకికొనఁ దివిరినాఁడు. ఇంద్రభట్టారకునకుఁ జతుర్దంతియే యిప్పుడు శరణ్యము. అతఁడు కదంబ రవివర్మ సోదరిని వాసట భట్టారికను బరిణయమై యాతనితోఁ గలిసి హరిసేనునిపైఁ గత్తి కట్టెను. హరిసేనుని యౌద్ధత్యముపట్ల అసంతృప్తులై యుండిన వాకాటక సామంతులు ఎవరిమట్టునకు వారు ఇంద్రభట్టారకునకుఁ ద్రోవవిడిచి యూరకుండిరి. ముల్లు పుచ్చి కొఱ్ఱడచుకొనుచుంటిమని వారప్పు డెఱుంగరు. మధ్య దేశములవఱకు నింద్రభట్టారకుని యాత్ర నిరాఘాటముగ సాగెను. వరదా పినగంగాసంగమ స్థలమున వృద్ధహరిసేనుఁడు ఇంద్రభట్టారకుని ఎదుర్కొనెను. కళింగములనుండి మితవర్మ తన బావకు బాసటగావచ్చి నిలిచెను. ఐన నేమాయె. ఇంద్ర భట్టారకుఁడు హరిసేనుని బొట్టఁబెట్టుకొనెను. రవివర్మ మిత వర్మను మ్రింగివైచెను. హస్తిభోజుఁ డేమయ్యెనో! జయావళి యెందఱిగెనో! ఇంకెచ్చటి కరుగును? కళింగములకే యరిగి యుండును. ఇంద్రభట్టారకుఁడు తన సేనలను కళింగముల మీఁదికి బట్టించెను.

మహాకోసలముల భవదేవరణకేసరి బోనులోని సింగము వలె గర్జించుచుండెను. కాని యేమిచేయఁగలఁడు? ఒకవంక చేదిపరితాపశీలుఁడు, వేఱొక వంక కొంగోడ సైన్యాధిపుఁడు నతనిని కదలకుండ బంధించివైచిరి. ఇందరివర్మ యువరాజు తాను కళింగములందే యుండవలెనని తండ్రిచే నాజ్ఞప్తుఁడై యుండెను. తమ సేన సగపాలు తండ్రివెంట నేఁగెను. మిగిలిన సేనతోఁ దాను నాగావళి దక్షిణతీరమున నిందరిభట్టారకుని సేనల నెదుర్కొనెను. తన సేన యేమయ్యెనో! నాగావళిలోఁ గలిసిపోయెనో! వంశధారపాలయ్యెనో! గంగామల కులము నకు బురిటిలోనే సంధికొట్టెను. కదంబ రవివర్మ పుత్రికయైన వాసట భట్టారికను పెండ్లియాడుమని తండ్రి తన్ను ప్రోత్స హించెను. అట్లయినచో కదంబులు తమవారై యింద్రభట్టార కుఁడు ఒంటరియగును. పసరుపూపయగు గంగరాజ్యమునకు వానివలన ప్రమాదము వాటిల్లకుండును. హరిసేనుని పుత్రిక జయావళిని పెండ్లియాడుమని తన తల్లి యుద్బోధించెను. కదం బులు తన యన్నగారికి శత్రువులు. కదంబులతోడి తమ సంబం ధము ఆయనకు రుచించుటెట్లు? తమ్ముకళింగముల నిలిపినది హరిసేనుఁడు. ఆయన బిడ్డ జయావళి పరమసౌందర్యవతి. సకల విద్యల నారితేరినది. వాకాటక రాజ్యమునకు వారసురాలు. జయావళి తనకు సాక్షాత్తుగా మేనగోడలు. ఆమెను పెండ్లా డుట యుభయతారకముగా నుండునని తల్లి తనకు బోధిం

చెను. తనకు తల్లి బోధయే రుచించెను. జయావళి యింద్రవర్మ రాణి యని బంధువులు తమ బాల్యమునుండియు నొకచే పాటగాఁ బాడుచుండిరి. ఆ పాటలే తమ పెండ్లికి మంత్రము లైనట్లు తా మిరువురును భావించుకొనుచుండిరి. బాల్యము నుండియుఁ దా మిరువురును నాటపాటలలోఁ జదువుసాము లతోఁ గలసిమెలసి యుండిరి. ఇంతలోఁ దాను కళింగమునకు వచ్చివేసెను. తాను జయావళిని చూచి యైదారేండ్లయినది. నిరుడు శ్రీశైలమల్లికార్జున దేవర యుత్సవములందు ఇంద్ర భట్టారకుఁ డామెను గాంచెనఁట, ఆమెను గామించెనఁట. తన వాంఛ యొఱింగించి వంచితుఁడయ్యెనఁట. వాని నడకయే కాదు వాని బుద్ధికూడ కుంటిదే. ఐన నేమి ఈ రోజు వానిది. కాదు. వాని చౌదంతిది.

జయావళి యేమయినదో! నందివర్ధన పురమునకుఁ బోయి యుండునా ? హస్తిభోజుఁడు సమయజ్ఞుఁడు. హరి సేనుఁడు విజయగర్వమున నాయన యుపదేశము లాలింపఁ డయ్యెఁగాక. వాకాటకలక్ష్మి కిట్టి యిక్కట్టులు రావలసినవేనా? జయావళి యేమైనదో! తనవలె నే కాంతారముల పాలైనదో !

ఇంద్రవర్మకుఁ దెల్లవారులు నిద్దుర పట్టలేదు. మెలకువ కలుగను లేదు. ఆయన యేమేమో కలువరించుచుండెను. ఆ కలువరింతల కొకదారియు నొక తెన్నును గనఁబడలేదు. తుంపులు త్రుంపులయిన యా కలువరింతలను బ్రోవుచేసి తన

యూహాలచే వాని నతుకులుపెట్టి యగ్నిస్వామి తత్కాల దక్షిణాపథ చరిత్రమునకు సరిపెట్టుకొనుచుండెను.

తానింతవఱకును ముఖలింగదేవర పూజారి. తన్నిప్పుడు ప్రభువు పురోహితుఁడనెను. ముఖలింగదేవుఁడు తన ముఖమునఁ బ్రభువున కేమి కళ్యాణములు చేయింపనున్నాఁడో!

తెలతెల వారు వేళ ఇంద్రవర్మ కలువరింతలు మాని రవంతనిద్దురలోఁ బడిపోయెను. అగ్నిస్వామి లేచి యొక్క పరుగున వంశధార కేగి మూఁడు మున్కలువైచి యనుష్ఠానము ముగించుకొని స్వామి కభిషేకము గావించి వడివడి కుటీరమునకుఁ దిరిగివచ్చెను. ప్రభువింకను నిద్దురలోనేయుండెను. అగ్నిస్వామి పుళిందసేనుని మందిరమునకుఁ బోయి యాయన దర్శనము చేసి యీ విచిత్రసంఘటనను చల్లగా నాయన చెవిలో నూదెను. ఆయన యాశ్చర్య చకితుఁడయ్యెను. అంగరక్షకుల భుజములపైఁ జేతులూది యాయన ప్రభువు దర్శనమునకుఁ పరుగెత్తుకొని వచ్చెను.



ప్రభువునకు మెలకువ వచ్చెను. ఆయన కన్నులు దెఱచి కుటీరము కలయఁజూచెను. అగ్నిస్వామి కనఁబడలేదు. ఆయన మెల్లగా లేచి దిండుపై నెడమచేయూది కూర్చుండెను. ఆయన కన్నులు జోతులవలె నుండెను. కన్నులేవో గాయములేవో తెలియరానట్లుండెను. తెల్లవారినది. ఇప్పుడు కర్తవ్యమేమి ? అగ్నిస్వామితో నాలోచింతమన్న నాయన యగపడలేదు. అగ్ని స్వామియే తన కిప్పుడు పురోహితుఁడు, మంత్రి. తన సేన యేమైనదో. ఇంద్రభట్టారకుని యాత్ర యెంతవఱకు సాగినదో, ప్రభువును గానక తన సేన వెఱచి పారెనో, నిలిచి పోరెనో. ఈ యశ్వము తన్నిట్లేల కొనివచ్చినది? రాజ్యమును శత్రువునకు విడిచిపెట్టి తా నిచ్చట నెట్లు నిద్రించెను ?

ఇందవర్మ దిగ్గున లేవఁబోయెను. అగ్నిస్వామి "ప్రభూ! పుళిందసేనుఁడు దర్శనమునకు వచ్చినాఁడు. ప్రవేశపెట్టుదునా?" అనెను. ఇందవర్మ మరల దిండుపై నానుకొని "యట్లే కానిండు" అనెను. వృద్ధపుళిందసేనుఁడు కుటీరము ప్రవేశించి మోకరిల్లి ప్రభువుపాదములఁదల మోపిమ్రొక్కెను. ఆమ్రొక్కుట ఇందదేవుని మోల నైరావతము మోకరిల్లిన ట్లుండెను. ఇంద్రవర్మ పుళిందసేనుని భుజములు స్పృశించి "శబరపతీ ! లెమ్మో" అనెను. పుళిందసేనుఁడు ప్రభువు పాదముల చెంతఁ

గూర్చుండి తలయెత్తి యాయన వంకఁ దిలకించెను. ఆయన యొడలినిండ నరమూతలు పడియున్నవవి కన్నులా? గాయములా? పుళిందసేనుఁడు ఐరావతశుండాదండసదృశమగు తన దక్షిణ హస్త మెత్తి ప్రభువు కాయము స్పృశింపబోయెను. కాయమునిండ వేయి గాయములు. ప్రభువు బలవంతముగఁ జిన్ననవ్వు తెచ్చికొని యొడలిమీఁది కుత్తరీయము సవరించుకొనఁబోయెను.

"ప్రభూ! ఈ మధుకాంతారము మహౌషధీమయము. ఈ యోషధుల గాలులు సోకినచో నిట్టి గాయములు కోటియైనను నిట్టె కన్నుమూయఁ గలవు. వాయు ప్రసారము నవరోధింపకుఁడు" అని పుళిందసేనుఁడు కుటీరము వెలుపల వేచియున్న యంగరక్షకుని శస్త్రవ్రణౌషధిని గొనిరమ్మని తన మందిరమునకుఁ బంపెను.

గర్సడా చీకటి మొగముననే లేచి వంశధార నొక్కగంతున దాటి యవ్వల మధుకవృక్షము చేరెను. అచ్చట నేమున్నది? వాని యాస యడియాస య య్యెను. అచ్చట సర్పములేదు. కాని ఇది యెవ్వనిదో తలపాగ తన యమ్మునఁ దగుల్కొని యున్నది. గర్సడా దానిని దీసి యటునిటు ద్రిప్పి వింతగాఁ బరికించెను. వాని కొక వింత యూహ తోచెను. ఆ యుష్ణీషమును దలపై నిడికొని వంశధారలోఁ దననీడ చూచుకొనెను. అబ్బో! తన ముఖమునకుఁ గ్రొత్త ఘెలుఁగు వచ్చి

నది. ఈ వేషముతోఁ బోయినచో ఇంద్రాణి తన్నుగాంచి యబ్బురపడును. వాఁ డా యుష్ణీషమును శిరమున మాటి మాటికిఁ బదిలముగా నమర్చుకొనుచు రాచనడకలతో ఇంద్రాణికిఁ గనిపింపఁబోయెను.

ఇంద్రాణి కా దినమున చౌదంతిపై స్వారిచేయవలెనని సరదా పుట్టెను. ఆమె పెందలకడ లేచి యలంకరించుకొని తండ్రికిఁ జెప్పి పోవలెనని చూచెను. తండ్రి యగపడలేదు. ఆమె మందిర ప్రాంగణమునకు వచ్చునప్పటికి గర్సడా యల్లంత దూరమున నగపడెను. వీని నెత్తిపైన నీవింతవస్తు వేమని యామె కన్ను లింతచేసికొని తిలకించుచుండెను. గర్సడా కా కన్నులలో నీదులాడవలె ననిపించెను. తా ననుకొన్నంతయు నైనది గదా యని వాఁడు లోలోనఁ గులికికొనుచు నేమియుఁ బట్టించుకొననట్లుగా నామెముందు రాచనడకలుపోఁదొడఁగెను. వాఁ డెంత యాపుకొన్నను వాని ప్రాణము లామె కన్నుల మీఁదికే గుంజుచుండెను. నడుమ నడుమ దొంగచూపులు చూచుచు వాఁ డల్లే బింకముగ నటునిటు పచారులు చేయుచుండెను. ఆ యుష్ణీషమున వాని శిరస్సు కనుబొమలవఱకు మునిగిపోయెను. కనుబొమలతో దానిని పై కెగఁద్రోసికొనుట వాని కొక పని యయ్యెను. చూచిచూచి యింద్రాణియొక్క సారిగా ఫక్కాలున నవ్వెను. గర్సడాయు నవ్వెను.

"ఇన్నాళ్లును కోతి కోతి యనుచుంటివే. ఇప్పు డేమందువు ?"

''కొండముచ్చందును''

గర్సుడా మొగము ముడుచుకొనెను.

''ఇప్పు డచ్చముగా కొండముచ్చువలెనే యుంటివి.'' గర్సుడా మూతి ముడుచుకొనెను.

"మూతి యింకఁ గొంచెము సాగఁదీసినచో అచ్చమడవి పందివలె నుందువు.''

''అట్లే యనుము. మీ యయ్యతోఁ జెప్పి ఏమి చేయింతునో.''

"ఏమి చేయింతువు?''

"ఏమి చేయింతునా ? పెండ్లి చేయింతును పెండ్లి.''

''పెండ్లికొడుకు నెచ్చటనైనఁ బట్టుకొని వచ్చితివా నేనును అందులకే యలంకరించుకొని కూర్చుంటిని లే.''

''ఎచ్చటనో పట్టుకొని రానేల ? ఇడుగో ఇచ్చటనే యున్నాఁడు.''

గర్సుడా యుష్ణీషముమీఁది తురాయి సవరించుచు తీవు లొలుకఁబోసెను.

"అట్లే చేయింతువుగాని ఇంతకు నీ తలపాగ యెక్కడ దొంగిలించితివి ?''

''దొంగిలించుటా ? దొంగిలించు గతి నాకేమి ? కదన

రంగమున శత్రువు నోడించి కప్పముగాఁ బట్టుకొని వచ్చితిని."

"అబ్బో!"

"అబ్బో కాదు. ఏమి జరిగినదో విన్నచో నీవు ఆశ్చర్య పడిపోదువు."

"అన్నియు సరియేకాని నిన్న సాయంకాల మేటి యావలితీరమున నీవేమైనవింత చూచితివా?"

"ఇప్పచెట్టు మొదట నేనా?"

"అవునవును".

"ఎఱ్ఱపొడల పామేనా?"

"నీ కెప్పుడును పాముల గొడవయే. పాడు పాములను దినితిని నీ బుఱ్ఱ యిట్లయినది. పాముగాదు మానిసి."

"మానిసిని నేను జూడలేదే. నేను జూచినది పాము. ఆ పాము ఆ మానిసిని మ్రింగినది గావలయును. దాని తలపై ఈ మణి మిలమిల మెరసినది."

ఇంద్రాణి గుండెలు దడ దడ లాడసాగెను. ఆ రాజ కుమారుఁడు కొండచిలువ వాతఁబడెను గాఁబోలు. గర్వడా చెప్పుచుండెను.

"ఈ మణి నీ మెడలోఁ గట్టవలెనని నా కనిపించినది. ఒక్క దెబ్బతో నా పాము పని పట్టించితిని."

"పట్టించి యేమి చేసితివి! పీకుకొని తింటివా? నిజము చెప్పుము. ఆ మానిసిని విసపుటమ్ముసఁ గొట్టి చంపితివా?"

"అసలచ్చట మానిసి యేడి ?"

"మానిసి లేనిదీ పాగా యేడనుండి వచ్చినది ?"

"ఏమో ! నే నిప్పుడు పోయి చూడఁగా చెట్టు మొదట నీ పాగా యగపడినది. నీ కియ్యవలెనని దీనిని దెచ్చినది"

"నీవబద్ధ మాడుచున్నావు. నీ వామానిసినేదో చేసితివి. నిజము చెప్పుదువా ? లేదా ?" అని ఇంద్రాణి గర్సడా చెవిపట్టి మెలివెట్ట సాగెను. వాఁడు పండ్లికిలించుచుఁ గోతివలె గంతులు వైచుచుండెను. ఓపధికోఅకు పుళిందసేనుఁడు పంపిన యంగరతుకుఁ డంతలో నచ్చటికి వచ్చెను.

"పేడా ! మాయయ్య యేడ?" అని యింద్రాణి వాని నడిగెను. వాఁడు పూజారి యయ్య వారి యింటి దిక్కుఁ జూపెను. ఇంద్రాణి గర్సడాచెవి యల్లేనులుముచు "రా. మా యయ్య కడకుఁ బోదము. ఆయన నాకుఁ బెండ్లియే చేయునో నీకు లగ్గమే పెట్టునో చూతువుగాని" అని వానిని అగ్నిస్వామి కుటీరము దిక్కున కీడ్చుకొనిపోయెను. వాఁడు గంతువైచి నప్పుడెల్ల ఇంద్రాణి చేతిపట్టు జారిపోయెను. జారి పోయినప్పు డెల్ల వాఁడు మరల గంతువైచి చెవి పట్టించుకొనును. అగ్ని స్వామి కుటీరము చేరువ చేరువలకు వచ్చి గర్సడా యొక్క గంతునఁ జెవి వదలించుకొని పరువిడసాగెను. ఇంద్రాణి యా తొందరలో ఉష్ణీషపుఁ దురాయిని ఒడిసి పట్టుకొనెను. తురాయి యామె చేతిలోఁ జిక్కెను. దాని నామె తన చెవి చెంత జెక్కుకొనెను. గర్సడా లేడివలె దాటుకొనుచుఁ

జారిపోయెను. పుళిందసేనుఁడు గత రాత్రి చరచిన చరపు వాని వీపుపై నింకను చురచురలాడుచునే యుండెను. వాని పిటికి తనమునకు ఇంద్రాణి కిల కిల నవ్వెను.

ఆ నవ్వు చెవ్వులఁబడి ఇంద్రవర్మ మనస్సు రివ్వునఁబోయి జీలుగుకొమ్మపై వ్రాలెను. అటనుండి వత్సగుల్మ పురమున కెగిరిపోయెను. జయావళికూడ ఈ యడవులకే వచ్చినదా? ఇంద్రవర్మ ముఖమున నొక వెన్నెలరేక తొంగిచూచి వెంటనే మబ్బుతెరలో సురిగిపోయెను. ఆయన ముఖమునందేదో వెలితి యిప్పటికిఁ బుళిందసేనునకు గోచరించెను. ఉష్ణీషహీనమైన యాయన ముఖము పరివేష హీనమైన చంద్రబింబమువలె నుండెను. పుళిందసేనుఁడు తన నెత్తి మీఁది నెమ్మి యాకలపాగను దీసి "ప్రభువా! కిరీటము లేక విన్నబోయిన మీ ముఖము నేను చూడఁజాలకున్నాను. దీని నిప్పటికి శిరమున ధరించి ఈ శబర రాజ్యము మీదే యనుకొనుఁడు" అని ప్రభువున కర్పింపఁ బోయెను. ప్రభు వాయనను వారించి "శబరపతీ! నీ యాదరణము, అగ్నిస్వామి యాశీర్వచనము, ముఖలింగదేవర కృపావీక్షణము సాధింపనేరని దేమున్నది? ఈ కిరీటము నీ శిరముననే మిక్కిలి శోభిల్లఁగలదు. దీనిని నీవే ధరింపుము" అనెను.

ఇంద్రవర్మ మాట్లాడుచుండెనే కాని ఆయన చూపులు కుటీరాంగణముననే తారాడుచుండెను. ఆయన మనస్సు ఏ దూరసీమలకో పరువులెత్తుచుండెను. గర్సడా యల్లంత

దూరము పరుగెత్తి వెనుకకుఁ దిరిగి పండ్లికిలించుచు 'ఇంద్రాణీ' యని కేక వైచెను. ఇంద్రాణి 'ఓ' యని వాని కేకకు మారు కేక వైచెను. ఆ కేక మధుకవనమునఁ జెట్టు చెట్టునను 'క్రో' యని ప్రతిధ్వనించెను. ఆమని రానేవచ్చినది. ఆశ్రమమునకుఁ గంతను విచ్చనే విచ్చినది. ఇంద్రవర్మ యా పాదచూడము మొగ్గ దొడిగెను. మధుమాసపుఁ దొలినాఁటి రక్తాశోకపోతము ననుకరించెను.

షేడా చేతిలోని యోషధిని దీసికొని యింద్రాణి కుటీర ద్వారమున "అయ్యో" యనుచుఁ దొంగిచూచెను. పుళింద సేనుఁ డింద్రాణి చేతినుండి యోషధిని దీసికొనుచు "ప్రభువా! ఇది నా కుమార్తె" యనెను. ఇంద్రాణి తత్తరపడుచుఁ దండ్రి వెనుక నొదిగి యా యపూర్వ వ్యక్తివంక నిర్నిమిష దృష్టులఁ దిలకించుచుండెను. శాపాభిత ప్తయై శబర కాంతగా జన్మించిన రంభయో, ఊర్వశియో యీమె! ఇంద్రవర్మ మొడల రెండు మూఁడు తెరలుగాఁ బులకలు పొగలు గ్రమ్మెను.

"ఈమె పే రింద్రాణి. పుళిందసేనునకు దైవదత్తయైన పుత్రిక. ఇంద్రాణీ! మహేంద్ర మహీధరాధిపతి, ఇంద్రవర్మ మహారాజులకు నమస్కరింపుము" అని యగ్నిస్వామి పలికెను. త్రిభంగీభంగాకృతి యగు గాత్రమున మాధుర్యములు జాలు వాఱుచుండ నింద్రాణి మగమీల నగజాలు వాలుగన్నుల నీరాజనము లిచ్చుచు నింద్రవర్మకుఁ బ్రణామాంజలి పట్టెను.

అగ్నిస్వామి కుటీరము దేవేంద్ర సభామందిర మయ్యెను. ప్రభువు కన్నుల కిందాణి రూపము సర్వాకాశమయమై కని పించుచుండెను. ప్రభువు వీనుల కిందాణి నామమే సర్వశబ్ద మయమై వినిపించుచుండెను.

"ఇంద్రాణీ! పెండ్లికూఁతురువలె వేషము ధరించి బయలుదేరితి వెచ్చటికమ్మా" అని యగ్నిస్వామి యిందాణి చెక్కులపై మోదుగులు పూయించెను. ఇంద్రాణి మరలఁ దండ్రి వెనుక నునుసిగ్గులు పోవుచు నొదిగి నిలిచెను.

"చౌదంతిపై నెక్కి యూరేగి రావలెనని మక్కువ పుట్టెను గావలయు"నని పుళిందసేనుఁడు బిడ్డను దనవీపున కదు ముకొని ముద్దుచేసెను.

ఇంద్రవర్మకు మొగమంతయుఁ గన్నులే యయ్యెను. ఆయన "చౌదంతియా?" యనెను.

"చిత్తము. మహాప్రభూ! మధుకాంతారమున నెంత కాలమునుండియో యొక చౌదంతి సంచరించుచున్నది. అది యంతయు నొక వింతకథ. దేవర యవధరింపవలెను" అని పుళిందసేనుఁడు చౌదంతి వృత్తాంతము చెప్పఁదొడఁగెను.

ఇందివర్మ మహారాజు మేనెల్ల వీనుగా వినుచుండెను. తండ్రిచాటునఁ బొంచి యింద్రాణి యిందివర్మనే చూచు చుండెను. గర్సడా తెచ్చిన యుష్ణీషమును దలపైఁ బెట్టినచో నిన్న సాయంకాలము వంశధార యవ్వలితీరమునఁ దన కగ పడిన పురుషుఁడీయనయే.

౧౦

ప్రభువా ! ఇది పదునాఱేండ్లనాఁటి మాట. వయస్సు వాటారుచున్న కొలందియు నాకు సంతానవాంఛ గాఢతరము గాఁజొచ్చినది. పంచక్రోశాత్మకమగు నీ జయంతీక్షేత్రమున మేము చూడని క్షేత్రము లేదు. ఆడని తీర్థములేదు. వేడని దైవములేదు. కాని ఏ శక్తికిని మాపైఁ గరుణ జనింపలేదు.

ముఖలింగమునకు దక్షిణమున నున్న జంబూతీర్థమునఁ గ్రుంకితిమి. పూర్వ మొక విప్రుఁడు శ్రీశైలమును దర్శించి యందొక జంబూవృక్షమెక్కి యాఫలములు భుజించి బీజముల నుమియుచుండగా నవి చెట్టుక్రిందఁ దపము గావించుకొను దుర్వాసునిపైఁ బడెనఁట. ఆయన కోపించి యా విప్రుని జండాలుఁడ వగుమని శపించెనఁట. పదంపడి కరుణ జనించి యా విప్రున కొక శుష్కజంబూకాష్ఠ మొసంగి యిది యెచ్చటఁ జిగురించునో యచ్చట నీకు శాపమోక్షణంబగునని యానతిచ్చెనఁట. ఆ విప్రుఁడు సకల తీర్థములుఁ గ్రుమ్మరి చిట్టచివరకీ క్షేత్రమునకు వచ్చినప్పు డాతని చేతియందలి నేరేడు కట్టె చిగిరించెనఁట. అది మొదలిది జంబూతీర్థమని ప్రసిద్ధి వహించినది. శుష్కజంబూకాష్టము చిగిర్చినది గాని మా జీవితములు చిగుర్పలేదు.

అటనుండి కదలి కోటితీర్థమునఁ గ్రుంకితిమి. విఘ్నేశ్వరుని గాంచి పరిహాసించి శంకరునిచే నభిశప్తుఁడై శ్వేతకుష్ఠ

పీడితుఁడైన చందుఁ డీ తీర్థమునఁ గ్రుంకి శాపము క్తుఁడయ్యె నఁట. చంద్రుని వ్యాధిని దీర్చిన యా తీర్థము మా యనపత్య తారూపమగు నాధిని దీర్పఁజాలక పోయెను. ఆ సమీపముననే చంద్ర ప్రతిష్ఠితమైన సోమేశ్వరలింగమును సేవించితిమి. సోమ తీర్థమునఁ గ్రుంకు లిడితిమి.

ముఖలింగ సోమేశ్వర లింగముల నడుమ భీమసేనునిచేఁ బ్రతిష్ఠింపఁబడిన భీమేశ్వరలింగమును సేవించితిమి. పాండవులకు రాజ్యప్రాప్తి ప్రసాదించిన యా స్వామి మాకు సంతానము ప్రసాదింపఁ డయ్యెను.

భీమేశ్వరుని దక్షిణ భాగమున స్వప్నేశ్వర లింగము గలదు. ప్రయతాత్ములమై యా స్వామిని సేవించి నాఁటి రేయి యా దేవుని స్మరించుకొనుచుఁ దత్సన్నిధానమున నిద్రించితిమి. తెల్లవారుజామున నీశ్వరుఁడు స్వప్నమున సాక్షాత్కరించి "శబరపతీ! పద్మనాభస్వామి నీ యందుఁ గరుణాళువై యున్నాఁడు నీవీ క్షేత్రములు దర్శించుచుఁ బద్మనాభగిరిపై గొంతకాలము వసించి యా స్వామి నారాధింపుము. నీకు సంతానము లభించును" అని సెలవిచ్చెను. నా భార్యయు, నేనును బరమానంద భరితులమైతిమి.

అటనుండి కదలి సూర్యతీర్థమునఁ గ్రుంకి, యాదిత్యలింగము నర్చించి, యాపై సిద్ధేశ్వర, కౌబేరలింగములను బూజించి

యక్షేశ్వర తీర్థమునఁ దానమాడి యటనుండి తూర్పుగా నరిగి మంకణ తీర్థమున మునిగితిమి. మంకణేశ్వరు నారాధించితిమి. అటనుండి బయలుదేరి పిశాచమోక్షణ తీర్థమును, పక్షితీర్థమునుఁ సేవించితిమి. దానికిఁ బశ్చిమముగా నున్న పద్మసరస్తీర్థమునఁ దానమాడితిమి. అనంతరము పద్మనాభదేవుని పాదములఁ బుట్టిన మలవిమోచన తీర్థమున గ్రుంకు లిడి మాచిత్తములందలి దుఃఖమాలిన్యము సగము క్షాళితమైన ట్లానంద మందితిమి. పద్మనాభగిరి పూర్వభాగమున ముక్తాఫల సదృశములగు జల బిందువులు నింతరముగాఁ బడుచుండు బిందుతీర్థమున స్నాన మొనర్చితిమి. అనంతరము హంసతీర్థమునం దవగాహనము గావించితిమి. మా చిత్తములు నిర్ధూత సకల సంతాపకళంక ములై నిర్మలము లయ్యెను. పద్మనాభదేవుని ప్రసన్న వీక్షణ ములు మాపైఁ బ్రసరించుచున్నట్లు మా యంగములు మా యంతరంగములును గలకదేరి నిర్మలము లయ్యెను. ఱెక్కలు వచ్చినట్లయి యానందమునఁ దేలియాడుచు నల్లంతలోఁ బద్మ నాభ పర్వతశిఖరమున స్వామి ముందల నిలిచితిమి.

విష్ణుదేవుఁడు శ్రీదేవిపై నలిగి భూదేవితో విహరింప మనసై వైకుంఠమును వీడి ఈ పద్మనాభగిరిపై వచ్చి కాపుర ముండెనని పెద్ద లందురు. వామహస్తమును భూదేవి నడుము నకుఁ జుట్టి దక్షిణ హస్తమున నభయముద్రపట్టి స్వామిమూర్తి చూడ ముచ్చటగా నుండెను. స్వామి మా పూజలందుకొనెను.

మా డెందములందలి యభివాంఛితము గ్రహించెను. భూదేవి వంకఁ గ్రీఁగంటఁ దిలకించెను. దేవి వదనారవిందమున మంద హాసము కందళించెను. మే మొకరివంక నొకరముఁ జూచు కొంటిమి. మా నోములు పంట మొగము పట్టిన వనుకొంటిమి. మనస్సులలోఁ గులికికొంటిమి. స్వామికిఁ గోటి మ్రొక్కులు మ్రొక్కుకొంటిమి.

కోవెల యెదుట వటవృక్షముక్రిందఁ గూర్చుండి దేవుని దలఁచుకొనుచుంటిమి. పర్వతపాదమునఁ గీచకారణ్యమునుండి శ్రుతి రమ్యమగు నొక ఘీంకారము వినవచ్చెను. నేనాదిక్కునఁ బరికించితిని. విరియఁబూచిన వేణుగుల్మాగ్రములు వింజామరలు వీచుచున్నట్లుండెను. గుల్మముల మాటుగా నేదో కదలుచున్న ట్లనిపించెను. మరియొక్క క్షణములో క్షీరసాగర తరంగ శిఖ రసముద్భూతమగు డిండీర ఖండమో యనిపించు మహాశుం డాల మొకఁడు గునగున నడచుచుఁ గోవెల దిక్కునకు వచ్చు చుండెను. స్ఫటిక ధవళమగు దాని కుంభస్థలముపై నిండ్రి నీలమువంటి వస్తువేదో నిగనిగలాడు చుండెను. మేము భయా శ్చర్య చకితులమై కోవెలలోఁ దూఱి స్వామి మరుగున దాగి తిమి.

మంద్రగంభీరముగ ఘీంకారము గావించుచు నా మద గజము కోవెలముఖమునకు వచ్చి కుంభస్థలమునందలి నీలమణిని తుండాగ్రమున గ్రహించి ద్వారబంధము చేరువగాఁ

బరుండఁ బెట్టెను. ఆ దంతావళము ఇంచుమించు దేవళమంత యెత్తుండెను. దాని ధవళకాంతులు కన్నులు మిఱుమిట్లు గొల్పుచుండెను. బారెడేసి పొడవున్న దాని దంతములు రెండా నాలుగా? నేను కన్నులు నులుముకొని మరల మరల చూచితిని. దాని దంతములు రెండుకావు. నాలుగు. దాని రెండు దంతములకుఁ దోడుగా ఆదివరాహము రెండవ కోరయు, విఘ్నేశ్వరుని రెండవ దంతమును గలసి వచ్చి దాని కుడియెడమలఁగుదురుకొన్నవి గావలయును. అది తన తుండాగ్రముతో నా యింద్రనీలమణిని దడవుచు నుపలాలించుచుండెను. ఆ మణి యటు నిటు గదలి కాలుసేతు లాడింప మొదలిడెను. నా యాశ్చర్యమునకు నానందమునకు మేరలేదు. మెల్లగా నా యిల్లాలి నీవలకు లాగి యా దృశ్యము నామెకుఁ గూడ చూపించితిని. ఆమె యానందపరవశయై "తల్లీ! నా యిల్లు పవిత్రముచేయ నవతరించితివా" యనుచు అమ్మవారి మూర్తిని మాటిమాటికిఁ దన ఔొమ్ముల నత్తుకొనుచు నున్మత్తయగు చుండెను.

చౌదంతి యా బిడ్డ నచ్చట నుంచి మెల్లఁగా వెనుదిరిగి కొండదరి చెట్లలో మరుగుపడి పోయెను. మే మిరువురము గొంత వడి యచ్లే విగ్రహముల మాటున నక్కియుండి యెట్టకేలకు గుండియలు బిగ్గబట్టుకొని కోవెల గుమ్మము కడకు వచ్చితిమి. చౌదంతి జాడ యగపడమిచే నించుక ధైర్యము వహించి ముద్దులొలుకుచున్న యా పాప పద్మనాభదేవుఁడు ఘాఖుఁ

ప్రసాదించిన వరముగా నెంచుకొనుచు బిడ్డదరి కేగితిమి. అది బిడ్డగాదు. తేజఃపుంజము. నేనా బిడ్డను జల్లగా నొడిలోనికిఁ దీసికొంటిని. బుగ్గలు పుణికి ముద్దాడితిని. నా యిల్లాలి చేతుల కందిచ్చితిని. బిడ్డ యేలనో కెవ్వుమని యేడ్చెను. గిరిపార్శ్వ మునఁ జౌదంతి ఘీంకరించెను. కొండ దద్దరిల్లి పోవునట్లఱచుచు నది రానే వచ్చుచుండెను. మాకుఁ బై ప్రాణములు పైననే పోయినట్లయ్యెను. చేతులలోని బిడ్డను రొమ్ముల నత్తుకొనుచు నా యిల్లాలును, నేనును తటాలున దేవళము ద్వారమున స్వామి మఱుగునఁ జేరితిమి. చౌదంతి దేవళముఁ దూఱి మరల నిలిచి తుండము పైకెత్తి యాకాశము బూరటిల్లునట్లు ఘీంక రించుచుండెను. అది నిజముగాఁ దలచుకొన్నచో దేవళము దాని ధాటికి నిలువగలదా? ఇప్పు డేమి చేయవలెను? బిడ్డను గుమ్మముకడ విడచియైన వచ్చితిమి కాముకదా! అది తుండ మును దేవాలయ గర్భము వఱకుఁ జాచి బిడ్డకై తడవుకొను చుండెను. నాకేమియుఁ బాలుపోలేదు. చౌదంతి యఱచిన కొలఁది బిడ్డ యేడ్చుచుండెను. బిడ్డ యేడ్చినకొలఁది అది యఱచుచుండెను. నాకు మతిపోవున ట్లుండెను. బిడ్డ నొప్ప గింపనిచో నిది యెట్లును మమ్ము బ్రతుకనీయదని నాకుఁ దెలిసి పోయెను. బిడ్డను రెండు చేతులలోఁ బెట్టుకొని నేను ప్రాణ ములకుఁ దెగించి మెల్లగా ముందునకడుగు మోపితిని. తల చితుకఁ బొడిచిన కొండచిలువవలె చౌదంతి తుండము దేవా

అదియు ద్వారమునఁ మెలికలు దిరుగుచుండెను. బిడ్డ కంటఁబడినంతనే యది తుండమును మెల్లగా ముందునకుఁ జాచి నా హస్తములందున్న బిడ్డ మేను నల్లనల్లన స్పృశించెను. బిడ్డ క్రమముగా నేడ్పు మానెను. చౌదంతి ఘీంకారములునుఁ జల్లబడెను. అది బిడ్డ శరీరము నెంతయోసేపు తుండాగ్రమునఁ బరామర్శించి మెలమెల్లగా నా హస్తములను, బాహువులను, కంఠమును, శిరమును దన కరమున నాఘ్రాణింపసాగెను. నా కొడలు జలదరించుచుండెను. కాని క్రమముగా భయము సడలుచుండెను. అది నా శిరస్సునందలి నెమ్మిపింఛమును బరామర్శించుచుండ నేను రవంత ధైర్య మవలంబించి కుడిచేత దాని తుండమును నిమురఁ దొడఁగితిని. చౌదంతి కెట్టకేలకు నా యందు ప్రత్యయము గలిగినట్లున్నది. అది తన తుండమును మెత్తగా నా కంఠమునకుఁ జుట్టి మంద్రస్వరమున నొకటి రెండు పర్యాయములు మృదు ఘీంకృతి గావించి మరల శిశువు నొడలెల్లఁ దడవి చూచుకొని తన తుండము నుపసంహరించుకొని వెనుదిరిగి మెలమెల్లగా మరలఁ బరిసరవృక్షపుంజముల మాటున కేగెను.

చౌదంతి యనుమతించినది. ఇక భయములేదు. శిశువును దీసికొని మే మిరువురమును బద్మనాభదేవునికిఁ బ్రణమిల్లి గృహోన్ముఖుల మైతిమి. కాని చౌదంతి భయము మా వెన్నులనంటియే యుండెను. అల్లంతదూరమ్ము నడచితిమో

లేదో చౌదంతి యఱపు మా వీపులపైఁ జఱచినట్లయ్యెను. వెను దిరిగి చూడగా నది యడుగులో నడుగువైచుకొనుచు మా వెనుకనే వచ్చుచుండెను. మాకు గుండెలు ఝల్లుమనెను. అది మా చేరువకు వచ్చి తుండమును ముందుకు చాచెను. నేను శిశువు నఱచేతులలో నుంచుకొని దాని కందఁజూపితిని. అది బిడ్డ యొడలంతయుఁ దడవిచూచుకొనెను. తుండాగ్రమునఁ జుట్టి శిశువును దన కుంభస్థలముపైఁ బెట్టుకొనెను. తనలోఁ దానేమో మెల్లగా గురగురలాడెను. మా పోవు దిక్కున నడువఁ దొడఁగెను. శిశువును నది విడువఁ జాలకున్నది. అది మాటిమాటికిని శిశువును దన కన్నులలోఁ బెట్టి చూచుకొనును. మరల మూర్ధమునఁ బెట్టి మోచుకొనును. తుండమునఁ బట్టి యూచుకొనును. తనలోఁ దానేమో గురగురలు పోవును. మేము ముందు, అది వెనుక, సంజవేళకు మా మందిర ప్రాంగణమునకు వచ్చితిమి.

నేను చౌదంతి యెదుట మోకరిల్లి చేతులు చాచితిని. చౌదంతి శిశువును నా చేతులలో నుంచి ముంగాళ్ళపై వంగి తుండాగ్రమున శిశువు శీర్షమున ముద్దులాడి మెల్లగా లేచి నిలుచుండెను. దాని కన్నులు నీళ్ళకుండలగుట చూచితిని. నాకును గన్నుల నీరు గిఱ్ఱునఁ దిరిగెను. "చౌదంతీ! నీ బిడ్డను నెత్తిపై బెట్టుకొని పెంచెదను. కన్నులలోఁ బెట్టుకొని రక్షించెదను. నీ యిచ్చవచ్చినప్పు డెల్లవచ్చి నీబిడ్డను జూచుకొనుచుండుము"

అనుచు నేను చౌదంతి తుండమునఁ జేయి యుంచి బుజ్జగించితిని. అది తుండమును బైకెత్తి కాహాళపట్టినట్లు జయఘీంకారము గావించుచు వెనుదిరిగి వచ్చినదారి బట్టెను. రిక్తకుంభస్థలమునుఁ దన తుండాగ్రమునఁ దడవుకొనుచు నది యరుగుటఁ దిలకించి నాకు దుఃఖము పొంగివచ్చెను. పాపము! దాని కడుపులోని మూగబాధ యెవ్వ రెఱుఁగఁగలరు? అది బరువుగా నడుగులు వైచుకొనుచు నడవిలోఁ గలసిపోయెను.

ఇది యంతయు భయాశ్చర్య విభ్రాంతులై తిలకించుచుండిన శబరు లెల్లరును చౌదంతి కనుమరుగైనంతనే మా మందిర ప్రాంగణమునఁ బ్రోవుపడిరి. ఆ కాలమున నీ యగ్నిస్వామి జనకుఁడు రుద్రస్వామి మా పురోహితుఁడు. నే నాయనకుఁ గబురంపితిని. ఆయన వచ్చి నడచిన వృత్తాంతమంతయు విని ఈ బిడ్డకు ఇంద్రాణి యని నామకరణము గావించెను.

ప్రభువు "ఇంద్రాణి, ఇంద్రాణి" యని రెండు పర్యాయములు కూడఁ బలుకుకొనెను. ఇంతసేపును దండ్రి వెనుక నిలిచి, యాయన భుజములపైఁ జేతులుంచి, యాయన మూఁపుపైఁ దల యానించి తన కథ నాలించుచుండిన యింద్రాణి ప్రభువు పిలుపునకుఁ దలయెత్తి తండ్రి భుజముమీఁదుగాఁ దొంగిచూచెను. ఇందీవర్మ చూపులు తెలినీటి కలువకొలనుబోని యామె కన్నులపై వ్రాలెను.

ఆ కొలనితోవి కలువపూతెప్పపై దేలుచు కర్ణమూలము చేరుకొనెను. కర్ణమూలమునఁ దళుక్కుమని తన తురాయి

మెరసెను. ఇది యప్పుడే యీయామె కర్ణావతంస మెట్లయ్యెనని యాయన యబ్బురంపడెను.

పుళిందసేనుఁడు చెప్పుచుండెను ; అటుపిమ్మటఁ గొంత గాలము చౌదంతి తరచుగా వచ్చి శిశువును జూచుకొనిపోవు చుండెడిది. అది వంశధార యొద్దునకు వచ్చి యొక్క కేక పెట్టును. నేను బిడ్డను దీసికొనిపోయి దాని కందింతును. అది కొంచెము సేపు శిశువును లాలించుకొని మరల నాకరములం దుంచి తన దారినఁ బోవును. బిడ్డకు గాలువచ్చిన పిదప నీమెయే చౌదంతి కేక విని గున గున లాడుచు బోయి తుండ మును గౌఁగిలించుకొనుచుండెడిది. ఇటీవల నైదాఱేండ్లగా చౌదంతి యీ చాయలకే వచ్చుటలేదు. ఇంద్రాణియే యప్పు డప్పుడు వేణువనముల కరిగి తన బాబాతోఁ గ్రీడించి వచ్చు చుండును. అది యీయామెను నన్నుఁ దక్క నన్యమానవులను బరిసరములఁ జేరనీయదు. కీచకవనముల కది చక్రవర్తి. ఏనుఁ గులు మందలు మందలుగా సంచరించుచుండు నా ప్రాంత ములకు శబరు లెవ్వరును బోవ సాహసింపరు.

రెండవ మానిసి వాసన తగిలినచోఁ జౌదంతి యింద్రాణి పిలుపులకుఁ కూడ మారుపలుకదు. గర్సడా యని నా కొక మేనల్లుఁడు గలఁడు. వాఁడు రూపమున సింగమే కాని గుణ మున వట్టి క్రోతి. ఇంద్రాణితోఁ జౌదంతి నెక్కవలెనని ఘాని

కొక్కెచే యారాటము. వాఁ డొకనాఁ డింద్రాణికిఁ దెలియ కుండ నామె వెనుక నరిగి పద్మనాభగిరిపై నొక చెట్టు మరుగున నక్కి యుండెనఁట. ఇంద్రాణి యాలయమండపమున నిల్చి చౌదంతిని బిలిచెనఁట. అది యెచ్చటనుండి వచ్చునో యింద్రాణికిఁ గూడ దెలియదు. అది యొక బండరాతి మాటున నిల్చి తుండమెత్తి బుస్సలు కొట్టుచుండెనఁట. ఇంద్రాణి యనుమానముతో నలుదిక్కులు బరికించెను గాని మనిషిజాడ యగపడలేదఁట. ఆమె "రా, బాబా, రా" అని బుజ్జగించెనఁట. చౌదంతి బలవంతముగా యింద్రాణి నెక్కించుకొని భయంకరముగా నుఱుముచు గర్సడా యున్న చెట్టు దిక్కు బరచెనఁట. దాని యఱపుల కడలిపోయి గర్సడా గడగడ వడకుచుండెనఁట. ఇంద్రాణి యిదియేమా యనుకొనుచుండగనే చౌదంతి యా చెట్టును దలతో నొక్క తాపు తాచెనఁట. దాని కోర యొకటి గర్సడా డొక్కలో బొడిచికొని వాడొక్క యఱపఱచి నేల గూలెనఁట. ఇంద్రాణి చౌదంతి చెవిలో నోఱుపెట్టి "బాబా, బాబా" యని యఱచుచు, దాని తుండము వెంట జట్టునజాఱి తుండాగ్రము నొడిసి పట్టి యెట్టులో గర్సడాను గాపాడెనట. చౌదంతి నంతట వెనుకకుఁ బంపివైచి ఇంద్రాణి గర్సడాకుఁ బ్రాణములు పోసి యింటికిఁ దీసికొని వచ్చెను.

ఇంద్రాణికి నేఁడు తన బాబాను జూడవలెననిపించినది గావలయును. నిండుగా నలంకరించుకొని బయలు దేరినది.

ప్రభువు సెల విచ్చినచోఁ బోయి వచ్చును."

ప్రభువు మందహాసము చేసి యూరకుండెను.

"తల్లీ ! ప్రభువు సెలవైనది. పోయి యాడుకొని రమ్ము"

ఇంద్రాణి కదల లేదు.

"పోయిరా తల్లీ ! ప్రభువనుమతించెను గదా"

ఇంద్రాణి కదల లేదు.

"ఏమి తల్లీ ! రేపు పోదువా ?"

"అయ్యో ! ఈ యోషధి నెందులకో తెప్పించితివి ?"

"అయ్యో ! తల్లీ ! నీ కథలోఁ బడి యసలు సంగతియే మఱచితిని గదమ్మా ! ప్రభువా ! ఈ యోషధి బట్టించినచో గడియ సేపటిలో గాయముల సలుపుతీయును. రాచుదునా ?"

"శబరపతీ ! నీ కథా వస్తువంతయుఁ గన్నుల యెదుట నిలిచి నేనీ గాయములమాటయే మఱచితిని. చూడఁ జూడ వీని నొప్పులు సగము తీసినట్లే యున్నవిసుమా" యనుచు ప్రభువు శరీరమును పట్టి చూచుకొనెను.

వృషంద సేనుఁడు ప్రభువు గాయములకోషధి పట్టించుచుండెను. అప్పు డగ్నిస్వామి "ప్రభూ ! నేను దంతపురము దిక్కున కేగి సమరోదంత మంతయుఁ దెలిసికొని వత్తును. పుళిందసేనుఁడు శబరనాయకులను సమావేశపఱచి కర్తవ్యమాలోచించును. ప్రస్తుతము దేవరయునికి పరమ రహస్యముగనుండఁదగునని నా భావము. ప్రభువుల యభిప్రాయము సెలవీయ్యవలెను"

అనెను. ప్రభువు కన్నులఅ మోడ్చి యించుక శిరము పంకించి యూరకుండెను.

అగ్నిస్వామియు, పుళిందసేనుఁడును కుటీరము వెలుపలికి వచ్చి "కుటీరము భద్రము సువూ" యని షేడాను హెచ్చరించి శబరవాటిక దిక్కునఁ బోయిరి.



## ౧౧

శబరవాటిక యంతయుఁ బుళిందసేనుని మందిరాంగణమునఁ బోఁగుపడియుండెను. గర్పడా వారి నడుమ గంతులు వైచుచు నేదో గాథ యభినయించుచుండెను. వాఁ డొకసారి బల్లివలెఁ బ్రాకుచు, నొకసారి పిల్లివలె నడచుచు, నొకసారి లేడి వలె దూకుచు తీరుతీరులుగా నభినయించుచుండెను. ఒకసారి యాశ్చర్యము, ఒకసారి యుత్సాహము, ఒకసారి యుద్రేకము ప్రదర్శించుచుండెను. ప్రేక్షకుల కిది యంతయు హాస్యముగ నుండెను. నడుమనడుమ వారు పగులఁబడి నవ్వుచుండిరి. గర్పడా యొక యమ్ము వింట సంధించి యాొడు గఱచుచు, బొమలు విఱుచుచు ప్రత్యాలీఢపాదుండై దేనినో గుఱి వెట్టి కొట్టుట నటించుచుండెను. వాని యంగప్రత్యంగ భంగిమలం దిలకించి శబరు లెడనెడఁ బకపకలు పోవుచుండ వాఁడు వారి నంగుళీ సంజ్ఞచే నదలించుచు నభినయము సాగించుచుండెను.

అగ్నిస్వామికిని బుళిందసేనునకు నిదియేమో తెలియ లేదు. గర్పడా మస్తకముమీఁది యుష్ణీషము వారికిఁ బరమాశ్చర్యము గలిగించెను. వారొకరి మొగ మొకరు చూచుకొనిరి. "ఈ యుష్ణీషము ప్రభువుదే. ఇది వీనికెట్లు లభించినది?" అని యగ్నిస్వామి యనఁగాఁ బుళిందసేనుని మొగమునఁ దెలివి తెల తెల వాఱెను. అగ్నిస్వామి మస్తిష్కమున నాలోచనా పరం

పర గిట్టునఁ దిరిగి పోవుచుండెను. పుళిందసేనుఁడేదో యనఁ బోవుచు నాయన మొగము వంకఁ జూచెను. ఆ మొగమున నపూర్వమైన తేజము మెరసి పోవుచుండెను. ఈయన శబర పురోహితుఁడైన యగ్నిస్వామి యేనా? ముఖలింగ దేవర జ్యోతిర్మయుఁడై యాయన ముఖమునఁ దాండవించు చున్నట్లుండెను. ఇంద్రాణి, చౌదంతి, యుష్ణీషము, ఇంద్రవర్మ - ఆయన యంతరంగమున నొకదాని వెంటనొకటి తళుక్కున మెరసెను. ఒకదాని నొకటి పెనవైచుకొనెను. ఒకదానిచుట్టు నొకటి తిరిగెను. ఉష్ణీష మింద్రవర్మ చుట్టును, ఆయన చౌదంతి చుట్టును, అది యింద్రాణి చుట్టును బరిభ్రమించుచుండెను. భవిష్యమున కింద్రాణి కేంద్రమై యగ్నిస్వామి ముఖము ప్రసన్నమయ్యెను. ఇంద్రవర్మ బ్రాహ్మణుఁడు. ఈ బ్రాహ్మణ రాజ్యము నెట్లయిన నిలుపవలెనని యగ్నిస్వామి నిశ్చయించు కొనెను.

గర్సడా తన యభినయ ప్రదర్శనమున మునిఁగి యుండెను. శబరు లెల్లరును వాని యభినయ దర్శనమున మునిఁగి యుండిరి. పుళిందసేనుఁ డా శబర ప్రేతకమండలిని సమీపించి "గర్సడా!" యని కేకవైచుసరికి వారందఱకు నొడళ్లు తెలిసెను. ఆ కేక విని యులికిపడి గర్సడా యొక్క గంతువైచి దౌడుపుచ్చుకొనెను. శబరులు చెల్లచెదరై విరిగిపోయిరి. పుళింద సేనుఁడు మరల "గర్సడా"యని గద్దించెను. ఆ గద్దింపుతో వాని

కరచరణములు స్థంభించిపోయెను. అగ్నిస్వామి వానిని సమీపించి "పారిపోయెదవేల ? రా" యనెను. వాడు బిక్కుబిక్కుమనుచుఁ బుళిందసేనుని వంకఁ జూడసాగెను. "భయములేదు. ఆయన నిన్నేమియు ననఁడు. నేనుంటిని గదా. రా" యని యగ్నిస్వామి వాని ప్రాణములకుఁ బూచీపడెను. వాఁడు పిల్లివలె ఆయన వెంట నడచెను. ఆయన వెనుక నక్కెను. పుళిందసేనుఁడు వాని మొగమున నపహసించి "ఏమిరా ! పారిపోయెదవు ?" అని యుఱిమెను.

గర్సడా వీపు దడవుకొనెను,

పుళింద : ఎంతదూరము పారిపోదువు ? దేశమును దెగించి పోదువా ?

గర్సడా తల తడవుకొనసాగెను.

పుళింద : ఆ తలమీఁది పాగ యేడ సంపాదించితివి ?

గర్సడా పాగదీసి తలవంచుకొని నిలువఁబడెను.

పుళింద : దొంగవలె నేల చూపులు చూచుచు మూరాడవేమి ? ఈ పాగ యేడ ధొంగిలితివి ?

గర్సడా యగ్నిస్వామి వెనుక నలుసువలె నక్కి "నది యొడ్డున దొరికినది" అని గొణిగెను. పుళిందసేనుఁడు "దొరికినదా ? ఊరక యెట్లు దొదికినది ?" అని పండ్లు పటపట లాడించెను. గర్సడా నెత్తిపైఁ బిడుగులు పడెను. వాఁడు గడ గడ లాడఁదొడఁగెను. అగ్నిస్వామి తనచేతి కఱ్ఱతో వాని వీపుఁన

దట్టుచు "దబ్బరలాడి నోట దుమ్ము కొట్టుకొనకుము. నిజము చెప్పుము. భయము లేదు" అని బుజ్జగించెను. బెదురుపెట్ట వల దని పుళిందసేనునకుఁ గనుసన్న చేసెను.

"ఏమిరా! పలుకవు? ఇంతసేపుగా శబరుల యెదుట నాడినదంతయు నాటక మేనా?" అని పుళిందసేనుఁ డదలింపుగా ననెను. గర్సడా ఱెప్పలచాటుగాఁ పుళిందసేనుని మొగమువంకఁ జూచి మరల చూపు క్రిందికి దింపుకొని యొక్క పొడవైన యూర్పు విడిచెను. వాఁడనుకొన్నంత కోప మా మొగమునం దగపడలేదు. "అమ్మయ్య! బ్రతికితిని" అని వాఁడు మెల్లగా నూపిరి త్రిప్పుకొని చల్లగా శిరము పంకించెను. పుళిందసేనునకుఁ దలనొప్పి పుట్టెను.

"ఈ తలత్రిప్పులు నాకుఁ బనికిరావు. నిజము చెప్పుదువా లేదా" అని యాయన గుఱ్ఱుమనెను.

అగ్నిస్వామి గర్సడా చెవిదగ్గఱ నేదియో మంత్ర మూదెను. "ఓరీ! నిజము చెప్పి నెత్తిపైఁ బువ్వులు పోయించుకొనుము. బొంకులాడి బొగ్గులు పోయించుకొనకుము" అని వానిని బ్రోత్సహించెను. గర్సడా కన్నులలోనికి మందహాసము త్రోసికొని వచ్చెను. ఇంద్రాణి పెండ్లికూఁతురై పుష్పాంజలితోఁ దన కన్నుల యెదుటఁ గులుకుచు మెలగినట్లు వాని కనిపించెను. వాఁడు తల మరింత వంచుకొని పాదాంగుళ్యగ్రమునఁ బుడమిపై నర్ధచంద్రరేఖలు లిఖించుచు "మామా! నిన్న సంజ

వేళ ఏటియావలి యొడ్డున మధుకవృక్షమూలమున నా కొక వస్తువు గోచరించినది. దాని శీర్షమున నొక మణి మిల మిల మెఱసినది. నే నది పామనుకొని యొక విసపుటమ్ముననఁ గొట్టితిని. నేఁటి యుదయము పోయి చూచితిని. అమ్మునఁ దగులొ్కని యీ పాగ యగపడినది. పా మగపడలేదు. దీనిని బట్టుకొని వచ్చితిని. మానిసిని జంపితినని శబరుల యెదుట నాటక మాడితిని'' అనెను.

అగ్నిస్వామి పుళిందసేనుని వంకఁ జిఱునవ్వు నవ్వెను. పుళిందసేనుఁడు ''ఏది యా యుష్ణీషము నిట్లిమ్ము'' అనుచు గర్సడా చేతులనుండి దానిని దీసికొని ''నీవు మానిసినే చంపితివి. సందియములేదు'' అనెను. ''అవును. నీవు మానిసినే చంపితివి. కానిచో పాములకుఁ బడగ లుండునుగాని పాగలుండునా ?'' అని యగ్నిస్వామి యనఁగాఁ దాను నిజముగ మానినినే చంపితినని గర్సడా నమ్మెను. మరి యామానిసి యేమయ్యెనన్న వాని సందేహమునకు ''నీవు ప్రాణములు హరించితివి. మేనేపులియో యాహరించి యుండు'' నన్న యగ్నిస్వామి పలుకు చక్కని సమాధానముగా నతుకుకొనెను. ''ఇంత కాలముగా బొంకులలోఁ బొరలాడి యంతయుఁ జెడకొట్టుకొంటివి. ఇంకనైనఁ గోతి వేసములు చాలించి కుదురుగా రాజమందిరమునఁ గూర్చుండి మామ చెప్పినట్లు వింటివా నీ ఫంట పండును. ఏమి వింటివా! ఇఁక పద'' అని యగ్ని

స్వామి గర్పడాను రాజకుటీరము దిక్కు నడిపించెను. పుళింద సేనుఁడును, అగ్నిస్వామియు సుష్టిపముతో రహస్యమందిరము లోని కరిగిరి. "శబరపతీ! మన ప్రియత్నము శుభారంభ మైనది."

"తమ సంకల్పము పరిశుద్ధము, పవిత్రము నైనది కను కనే యారంభమందే శుభశకున మైనది."

"ఇక ప్రభువు రాజ్యము నిలిచినట్లే."

"అంతయు ముఖలింగ దేవర యనుగ్రహము."

"ఆ దేవుని యనుగ్రహము సంపూర్ణముగ నుండుటవల్ల నే ప్రభుపీఠస్థానమున కాకర్షింపబడినాఁడు.

"ఆ దైవము తలంచుకొన్న నేదియేని చేయఁగలఁడు. కాని మనము ప్రభువునకుఁ జేయఁగలదేమో నాకుఁ దోఁప కున్నది."

"ప్రభువు విజయసాధన మీ నెలవునం దున్నది. అది నీ చేతులలోనే యున్నది."

"నాచేత నేమున్నది? అంగబలమున్నదా? అర్థబల మున్నదా?

"బలసర్వస్వమైన చౌదంతి యున్నది గదా!"

"చౌదంతియా? నిజమే! కాని స్వామీ! అది యిం దాణి చేతులలో నున్నది."

"ఆ యింద్రాణి నీ చేతులలో నున్నది గదా!"

"తమరు నాకు అసాధ్యమైన యాళ పెట్టు చున్నారు."

"అనఁగా ?"

"ప్రభువు ఇంద్రాణిని స్వీకరించునా ?"

"మరి యాయన యిచ్చటి కేల వచ్చెననుకొంటివి ?"

"తమరు విచిత్రమైన యూహ చేయుచున్నారు."

"వట్టి యూహకాదు. పదు నాలుగేండ్ల క్రిందట శబర పురోహితుని యమోఘ వాణి చేసిన శాసనము. ఇంద్రాణికి నామ కరణము చేయుచు నా పితృ పాదులు రుద్రస్వామి పలికిన యా శాసనము మఱచితివా ? మహేంద్రమహీధరాధిపతి యింద్ర దేవుఁ డీమెకుఁ బతి యగునని యాయన యాదేశింప లేదా ? ఆయన యింద్రాణి కట్టి నామకరణము గావించుట యాహేతువుననే కదా ? ఈశాన్య దిక్పతి యగు నింద్రాధిరా జధిరోహించునని కదా మా తండ్రిగారు చౌదంతికి సుప్రతీక మని నామ కరణము గావించిరి."

అగ్నిస్వామి మాటలు వినుచున్న కొలంది పుళిందసేనుని చికిలి కన్నులు విరిసి విప్పారి చేరెడేసి యయ్యెను.

"అవును రుద్రస్వామివారట్లే సెలవిచ్చి యుండిరి. కాని మాయందలి యనురాగాతిరేకమున నాడిన యతిశయోక్తులుగాఁ బరిగణించి నే నా పలుకులనప్పుడే విస్మరించితిని. మరల నిప్పుడు తమ ముఖమున రుద్రస్వామి వారే పలుకుచున్నట్లు వినిపించుచున్నది."

"మా తండ్రిగారి మాట లానాటి నుండి నేటి వఱకు నిరంతముగా నా చెవులలో రింగు మని మ్రోగుచునేయున్నవి. అనుక్షణము నేనా ముహూర్తము కొఱకెదురు చూచుచునే యుంటిని."

"ఓహో! ఈ వృద్ధ పుళిందసేనుఁ డెంతటి సుకృతి! కళింగము లాతని కారణమునఁ దేజరిల్ల నున్నవి!"

"శబర పతీ! శుభస్య శీఘ్రమ్! ఇంద్రాధి రాజు విజయ సౌధమునకు మూల స్థంభము ప్రతిష్ఠింతువు. రమ్ము."

నిద్రాణమై యున్న యుత్సాహశక్తి యొక్క మారుగా నుబికి వచ్చి పుళిందసేనుఁ డాపాద చూడము ఝల్లునఁ బులకించెను. ఆయన యొడలు విదల్చుకొని చివాలున లేచి పెద్ద పెద్ద యంగలు వైచుకొనుచుఁ బ్రభు దర్శనమునకు బయలు దేరెను. ఐరావత శుండాగ్ర సంలగ్నమగు పుండరీక మువలె ప్రభువు నుష్ణీష మాయన హస్తాగ్రమునఁ బ్రకాశించు చుండెను. అగ్నిస్వామి యుచ్చైశ్శ్రవమువలె నాయన వెనుకఁ దురికి నడకలఁ జిఱుత పరువులు పెట్టుచుండెను.

ఇంద్రాణి ప్రభువు గాయముల కోషధీచర్య యొనర్చు చుండెను. గాయములు వెడవెడ నఱమూతలుపడు చుండెను. ఇంద్రాణి హస్తపల్లవము సోకిన గాయము మూతపడు చుండెను. ఆ సోకునకై యెదురు చూచుచున్న ట్లితరగాయములు విస్ఫారు చుండెను. ప్రభువు ననుభావమ్ము లింద్రాణి కుద్దీపన

ములై యామె యనుభావము లాయనకు సాత్వికోదయ మొన రించు చుండెను. అంగప్రత్యంగములం దిట్లావిష్కృతమగు చున్న పారస్పరిక వికారప్రచారము అంతరంగికమగు నొకా నొక భావ సారూప్యము నా యిరువురియందు నిరూపించు చుండెను.

హస్తాగ్రిమందలి యుష్ణీషము నున్నగాఁ బుళిందసేనుఁ డగ్నిస్వామి కుటీరమునందల దూర్చుచునే ఈ భావసారూప్యము గుర్తించెను. ఇంద్రాణి ప్రభువు వక్షఃస్థల మందలి మణిహార ముల నొక చేత సవరించుచు వేఱొక చేత అందలి క్షతముల కోషధి పట్టించుచుండెను. ప్రభువొక చేత నింద్రాణి యలకలు సవరించుచు, వేఱొక చేత నామె కర్ణమూలమునఁ జెక్కికొన్న తన యుష్ణీషపుఁ దురాయిని బరామర్శించుచుండె.

పుళిందసేనుఁ డొక్కక్షణ మాగి మెల్లగా "ప్రభూ" యనెను. ఇంద్రాణి యులికిపడి హారముల సవరించుట మాని రెండు చేతులతోనోషధి చర్చ చేయసాగెను. ఈషత్కఠినమైన యా చర్చ ప్రభువు పారవశ్యమును శిథిలము గావించెను. ఆయన దృష్టు లింద్రాణి యానత వదనమున ముసరుకొన వెంపర లాడు చుండెను. పుళిందసేనుఁ డాలీఢాసనస్థుఁడై యుష్ణీష పూర్ణమైన యంజలి ముందునకుఁ జాచి మరల "ప్రభూ!" యనెను. ప్రభువు చూపులు చెదరి తటాలునఁ బుళిందసేనునిపై వ్రాలెను. తనకై సామ్రాజ్య లక్ష్మిని గొనివచ్చిన చౌదంతివలె పుళిందసేనుఁడు ప్రభువు బుద్ధియందు ప్రతిభాసించెను.

ప్రభువు కానరామిచే కళింగ సేనలలో మహా సంక్షోభ ముప్పతిల్లెను. ఇంద్రభట్టారకుని చౌదంతి, కుముదము మంద రము సాగరమును గలంచినట్లు కళింగ సేనలను గలఁచి కలఁచి కల్లోల పఱచుచుండెను. రాజకుమారుఁడు శాంతివర్మ పిరిగి పఱచుచున్న కళింగసేనలకు జెలియలికట్టయై నిలిచి సింహ నాదము గావించుచు చెదరిపోవు సేనలఁ బురికొల్పుచుండెను. ప్రభువు జాడల నరయుటకై శాంతివర్మ పదిదిక్కులకు పదువు రేసి యాశ్వికులను బరువెత్తించెను. క్షతగాత్రుఁడై ప్రభువు క్షణకాల విశ్రాంతికై రణరంగమునుండి తొలఁగి యుండును. ప్రభువిదె వచ్చుచున్నాఁడదె వచ్చుచున్నాఁడని శాంతివర్మ కళింగసేనలకు వీరరసము నూరిపోసి శత్రువు మీఁది కుసికొల్పు చుండెను. కళింగములం దొక్కొక్క యంగుళము నాక్ర మించుసరి కింద్రభట్టారకునకుఁ దలప్రాణము తోఁకకు వచ్చు చుండెను.

చతుర్దశినాఁటి సాయంకాలమునకు రణరంగము క్రమ ముగా జరిగి దంతపురము చేరువకు వచ్చెను. అంతఃపుర స్త్రీలు, పౌరజనము త్రయోదశినాఁటికే దంతపుర దుర్గమును వీడి మహేంద్రగిరి దుర్గమునఁ బ్రవేశించిరి. దంతపుర దుర్గమున గేవలము సైన్యముమాత్ర మ్మండెను, శాంతివర్మ ప్రధాన

ధండనాథుని మహేంద్రగిరి దుర్గరక్షణకై పంపి తాను దంత పుర దుర్గమునఁ బ్రవేశించి దుర్గద్వారములు మూయించెను. యుద్ధపరిస్థితియు, ఇంద్రవర్మ సంగతియు వివరించుచు విజయ కంధ్యపురాధిపతి పృథ్వీమూలునకు, మహా కోసలాధిపతి భవ దేవ రణకేసరికి వేగరుల నంపించెను. జయావళి యునికిఁ గని పట్టుటకై మధ్యరాష్ట్రములకు పలువురు గూఢచారులను-బంపించెను. ఇంద్రవర్మ యేమయ్యెనన్నది శాంతివర్మకు శల్య ప్రాయమైన సమస్య యయ్యెను. ఈ రెండు దుర్గములనైన శత్రు హస్తగతములు గాకుండ రక్షించి యన్నగారి కప్పగింపఁ గలనా యని శాంతివర్మ యాందోళన పడుచుండెను. శాంతి వర్మ కింకను నిరువదియేండ్లు నిండలేదు. ఆయన పసిహృదయమూ కంది కమలిపోవుచుండెను. ఇంద్రభట్టారకుఁడు కళింగము లందడుగుపెట్టినప్పుడే ఇంద్రవర్మ సందేహాందోళితుఁడయ్యెను. దక్షిణాపథమునెల్ల పిడికిటఁ బట్టి గడగడ లాడించిన హరిసేనుఁడే వానిముందు నిలువఁ జాలకపోయెను. ఆ వాకాటకసామ్రాజ్య మహావృక్షము నాశ్రయించుకొని యల్లనల్లన నెక్కి వచ్చుచున్న వేఁదీఁగె కళింగము. ఈ సుడిగాలి దాడికి నిలువఁద్రొక్కుకోఁ గలదా ?

అన్నగారి యూహా ననుసరించి శాంతివర్మ పృథ్వీమూ లునకు, భవదేవరణకేసరికి సమరోదంత మెఱిఁగించి పుచ్చెను. ఐదువేల సేనతో, రెండునెలల యాహార సామగ్రితో దంతపుర

దుర్గమునఁ జేరి కోడెనాగువలె బుస్సలు కొట్టుచుండెను.

అగ్నిస్వామి వచ్చి చూచునప్పటికి దంతపుర దుర్గమును విష్ణుకుండిన సేనలు కొండచిలువవలె చుట్టుకొని యుండెను. రోణంకివద్దనే ఆయనకు సమర పరిస్థితి చాలవఱకుఁ తెలియ వచ్చెను. ఈ యుష్ణీషము దంతపుర దుర్గమునఁ జేరుట కిప్పుడు మార్గములేదు. ఆయన మహేంద్రగిరి దిక్కునఁ బరువెత్తెను.

ఇంద్రభట్టారకుని యాత్రాపురోగతి నెప్పటికప్పు డెఱింగి కొనుచుండిన కొంగోడ మండలాధిపతి సైన్యాభీతుఁడు మహేంద్రగిరి కడ ఆతనికి స్వాగతి నెఱపుటకై సేనా సమేతుఁడై బయలుదేఱెను. కొంగోడ సేన లింకను రెండుక్రోసుల దూరమునం దుండఁగా మహేంద్రగిరి కా వార్త యందెను. దుర్గాధిపతి వీరసేనుఁడు దుర్గద్వారములు బంధించుట కాజ్ఞ యిచ్చెను. నూఱేనుంగు లేకకంఠమున ఘీంకరించినట్లు దుర్గ ద్వారములు కిఱ్ఱుమని కదలి కదియ వచ్చుచుండెను. అల్లంత దవ్వుల నెవ్వఁడో పురుషుఁ డశ్వముపై నురికి వచ్చుట వీర సేనుఁడు తిలకించెను. అతని దక్షిణ హస్తాగ్రమున పాలక్రొన్నురుగు దబ్బువలె నేదియో మెఱసిపోవుచుండెను. ఆతఁడు చేరువ యైన కొలందియు నాతని గళమును జీల్చుకొని యెగసివచ్చు జయజయ ధ్వానములు స్ఫుటతరముగ వీరసేనుని వీనులకు సోకుచుండెను. వీరసేనుఁడు ద్వారమున నిలువఁబడి యా పురుషుని హస్తాగ్రమున మిలమిలలాడు నుష్ణీషమును గుర్తించెను.

అతని గుండె హఠాత్తుగా నాగిపోయిన ట్లయ్యెను. ఆయన మొగమునఁ గత్తివాటునకును జుక్క నెత్తురులేదు,

అగ్నిస్వామి గుఱ్ఱముతోపాటు తానే దుమికివచ్చు చుండెనా యన్నట్లుండెను. ఆయన యొక్క గంతున వీర సేనుని ముందు దుమికి యుష్ణీషము నాతని హస్తములందుంచి "ప్రభువు పద్మనాభగిరిపై సురక్షితముగ నున్నారు. ఒడలెల్ల గాయములైన ప్రభు విప్పుడు కదలు స్థితిలో లేరు. భర్తృ మరణ దుఃఖితయగు మహారాజ్ఞి కీ వార్త వినిపించి ప్రాణ ములు నిలుపుడగు. అచిరకాలమున సర్వము సంపన్నముగాఁ గలదు.''అని యొక్క గుక్కలో విశదముచేసెను. వీరసేనుఁడు ప్రధాన దండనాథుఁడగు భానుసింహునకుఁ గబురుపెట్టెను. ఆయన దుర్గరక్షణ సన్నాహనిమగ్నుఁడు ఉన్నవాఁ డున్న ట్లురికివచ్చెను. రెండు క్షణములు మంత్రాంగము. దండనాథుఁడు నిరువురు మంత్రులు, నిన్నూ రాశ్వికులు నగ్నిస్వామి వెంట మధుకాంతారాభిముఖులై పరుగువెట్టిరి. దుర్గద్వారము సుసం ఘటితమై గోకర్ణేశ్వరుని యాలయ రక్షకుఁడైన నందీశ్వరుని ఫాలమువలె నుండెను.

గోకర్ణేశ్వరుని పాదమూలమున మహారాణి చారుదేవి యొడలెఱుఁగక పడియుండెను. భర్తృదుఃఖ మొకవంక, సోదరదుఃఖ మొకవంక ఆమె హృదయమునఁ బోటులెత్తి కన్నులవెంట వరదలు కట్టుచుండెను. ఇంద్రవర్మ స్థితి యామె

దుఃఖము కట్టలు త్రెంచిపైచున ట్లుండెను. పరిచారిక లామెను సేద దీర్చుటకు సర్వవిధముల యత్నించుచుండిరి. క్రమముగ నామెకుఁ దెలివివచ్చుచుండెను. దుర్గరక్షకుఁడు దర్శనము వేచి యుండెనని పరిచారిక లామె చెవిలో విన్నవించిరి. ఆమె రవంత కన్ను విచ్చిచూచెను. వీరసేనుఁడు "తల్లీ ఇంద్రవర్మ మహారాజు కుశలి. తమ కుశలచిహ్నముగా ప్రభు వీ యుష్ణీషమును దమకుఁ బంపినారు" అని యుష్ణీషమును మహారాణి చరణ సమీపమునం దుంచెను. ఆ వార్త మహారాణి చెవులలో అమృతము పోసినట్లయ్యెను. ఆమె యా యుష్ణీషమును దిలకించి యింద్రవర్మను దిలకించినంతగా నానందపడెను. వీరసేనుఁడు మెల్లగాఁ బ్రభువును గుఱించిన వివరములు మహారాణికి విని పించెను. ఆమెకుఁ గొండంత ధైర్యము గలిగెను. గోకర్ణ దేవునిపాదములకుఁ బునఃపునః ప్రణామము లాచరించి యామె దుర్గరక్షణమునం దప్రమత్తులై యుండుఁడని వీరసేను నాదేశించి పంపెను.

ఫాల్గుణ పాడ్యమినాఁ డుదయము రెండు గడియల ప్రొద్దెక్కువేళ ఇరువదిమంది యాత్రికులు వంశధార నుత్తరించి మధువనములందు సంచరింపసాగిరి. అందందు తమ కెదురైన శబరులవలన నయ్యది పుళిందసేనుని రాజ్యమని తెలిసికొని తిన్నగాఁ బుళిందసేనుని మందిరమునకు వచ్చిరి. పుళిందసేనుని కొలువకు మందిరములోనికిఁ గబురు పెట్టిరి. వేడా తిరిగి వచ్చి

"మీలో నాయకుఁ డెవ్వఁడో ఆతనికిఁ బ్రభుదర్శనమున కను మతి యైనది" అని యాశ్వికులతోఁ జెప్పెను. వారొకరి మొగ మొకరు చూచుకొనిరి. వా రింకను గుఱ్ఱములమీఁదనే యుండిరి. గుఱ్ఱములు కళ్లెములు నములుచుఁ గాళ్లు దువ్వుచుఁ గదనులు త్రొక్కుచుండెను. శిరము లెగురవైచుచు మాటి మాటికి సకిలించుచుండెను. ఆశ్వికులలో నొకఁడు ముందునకు వచ్చి "దక్షిణాపథపతి యింద్రభట్టారకుని సైనికులు వచ్చిరని మీ దొరతోఁ జెప్పుము" అని షేడాతో ననెను.

"మీ దళనాయకునకుఁ బ్రభు దర్శనమున కనుమతి యైనది. నీవు నాయకుఁడ వైనచో దర్శనమున కేగవచ్చును." అని షేడా సమాధాన మిచ్చెను. దళనాయకుఁడు మీసము లలో వికృతముగ నవ్వుకొని యశ్వము నవరోహించి మందిర ములోని కేగెను. అతఁడు మందిరమునం దడుగిడగనే ఇరు వులు శబరభటులు, ఆయుధపాణులు ఆతని కిరువైపుల నడచుచు నతనిని పుళిందసేనుని సమక్షమున నిలువఁబెట్టిరి. వ్యాఘ్రాస నమునం దాసీనుఁడైన పుళిందసేనుని వెనుక నలుగురు విలు కాండ్రు ఒక చేయివింటి నడుముమీఁదను, నొక చేయి యమ్ముల పొదిమీఁదను నుంచి సిద్ధముగ నుండిరి. ఆశ్వికుఁ డిట్లనెను. "ఇది సకల దక్షిణాపథపతి యింద్రభట్టారకుని యాజ్ఞ. కళింగ రాజిందవ్రివర్మ నీ యధీనమం దున్నచో వెంటనే మా కాతని నప్పగింపవలెను."

పుళింద సేనుఁడు మాటాడలేదు. పెడమొగము పెట్టు కొని యూరకుండెను. దళనాయకుఁడు మరల నట్లే యనెను. పుళింద సేనుఁడింకను నట్లే పెడమొగమై యుండెను. దళనాయ కుఁడు మరల నదే మాట యనెను. ఈ సారి వాని కంఠమున నొక్క యుఱుము, వాని కంట నొక్క మెఱపు వ్యక్త మయ్యెను.

పుళింద సేనుఁడొక్క సారిగా పులివలె గాండ్రించెను. "మహా కాంతారాధిపతి పుళింద సేనుని సమక్షమున నవినయము ప్రదర్శించు టిది యేటి సాహసము!"

దళనాయకుఁ డులికిపడెను. కొంచెము సంబాళించుకొని యిట్లనెను. "ఇది మా రాజాజ్ఞ"

"ఈ రాజ్యమునాది. మీరాజు నాజ్ఞ లిచ్చుట చెల్లవు. శబర రాజ్య మర్యాదలను పాటించి నీ రాజు కోర్కెను నివేదిం చినచో మేము వినుటకు సిద్ధముగా నున్నాము."

దళనాయకుఁడు నివ్వెరపోయెను. ఆతని కిరుప్రక్కల నిలుచుండిన భటు లాతనిచే మోకరింపఁజేసి శిరముతో భూత లము స్పృశింపఁజేసి మరల నిలువఁబెట్టి "యిప్పుడు నీ సందే శము నివేదించు కొనుము" అని బోధించిరి.

దళనాయకుఁడు కిక్కురు మనకుండ బొమ్మవలె వారు చేయించినట్లెల్ల చేసెను. "కళింగ రాజింద్రవర్మ యుద్ధరంగము నుండి పలాయితుఁడయ్యెను. అతనిని వెదకి పట్టుకొని రండని

ఇంద్రభట్టారక మహారాజులు మమ్మాజ్ఞాపించిరి.''అని యాతఁడు తలవంచుకొని పలికెను. పలికెనే కాని లోలోన తుకతుక నుడికి పోవుచుండెను.

''ఇంద్రవర్మ మహారాజేమయ్యెనో మేము స్పష్టముగాఁ జెప్పఁజాలము. ఆయన యుష్ణీషము మాత్రము మా చేతఁ జిక్కినది. దానిని మా పురోహితుల చేతి కిచ్చి ఇంద్రభట్టారకు లకుఁ బంపించితిమి. ఈ పాటి కది ఇంద్రభట్టారకుల సన్నిధి చేరియుండును. ఆ యుష్ణీషమును సంపాదించిన వాఁడు మా గర్సడా.''ఇట్లని పుళింద సేనుఁడు గర్సడాను బిలిపించెను. వాఁడు వచ్చి దళనాయకుని గాంచి గడగడలాడిపోయెను. పుళింద సేనుఁ డిట్లనెను. ''గర్సడా! ఈతఁడు ఇంద్రభట్టారకుల దళ నాయకుఁడు. నీవు తెచ్చిన కళింగరాజు తలపాగను ఇంద్రభట్టా రకులకుఁ బంపితిమిగదా. నీ వీతనివెంట నరిగి జరిగిన వృత్తాంత మంతయు నింద్రభట్టారకులకు వివరింపుము.''

గర్సడా పుళిందసేనుని పాదములపైఁ బడి 'మామా! నన్ను గాపాడుము కాపాడు'మని గోల పెట్టెను. పుళిందసేనుఁ డాతని వీపు దట్టి ''నీకు భయములేదు. వీరు కళింగ సైనికులు కారు. విష్ణుకుండిన రాజభటులు. నీవు విష్ణుకుండిన రాజునకు గొప్ప యుపకారము చేసితివి. నిన్నాయన యెంతో మెచ్చి గౌరవించును. పోయిరమ్ము. నీ మూలమున నింద్రభట్టారకుఁడు శబరజాతికి మిత్రుఁ డగును. నీవు మహాకాంతారాధిపతికి ప్రీతి

నిధిగా విష్ణుకుండిన చక్రవర్తి దర్శనమున కేగుచున్నావు. శబర జాతి గౌరవమునకుఁ దగినట్లు మెలఁగవలయును సుమా. భద్రము. పోయిరమ్ము'' అనెను.

గర్సడాకు ధైర్యము, నుత్సాహము వచ్చెను. వాఁడు యువరాజువలె వేషము ధరించి దళనాయకుని వెంట బయలు దేరెను. నిజమునకు గర్సడా యెవ్వరికిని భయపడఁడు. ఒక్క పుళింద సేనుఁ డన్ననే వానికి భయము. ఆ భయమున కింద్రాణిపై వానికిఁ గల యాశయే కారణము.



విష్ణుకుండిన దళము పూర్వ దిశాభిముఖముగఁ బోయి నదో లేదో వంశధారాతీరమున మఱియొక యాశ్విక దళము ప్రత్యక్ష మయ్యెను. ఆ దళముగూడ పుళిందసేనుని మందిర ప్రాంగణమునం దాగెను, భటు లశ్వముల నవరోహించిరి. దళనాయకుఁడు పుళిందసేనుని దర్శన మపేక్షించెను. ద్వార రక్షకుఁడు ఆశ్వికులు ధరించిన వృషభలాంఛనములు గుర్తు పట్టెను. పుళిందసేనునకు నివేదించెను. పుళిందసేనుఁడు తత్తర ముతోఁ దానే వచ్చి చూచెను. గాంగరాజభటులను గుర్తిం చెను. ఖిన్నములు, వ్యగ్రములునైన వారి వదనము లాయ నకుఁ బ్రీత్యయము పుట్టించెను. ఆయన దళనాయకు నీవలకుఁ బిలిచి యాతని చెవిలో రెండుమాట లూదెను. దళనాయకుని మొగము విప్పారెను.

పుళిందసేనుఁ డొక భటుని దోడిచ్చి యా దళమును క్రోశెడు దూరమునఁ గాంతార గర్భమునఁ గల యొక గూడె మునకుఁ బంపెను. సాయంకాల మగుసరికి ఒకదాని వెంట నొకటిగా వృషభలాంఛనములు ధరించిన దళములు పదివచ్చి చేరెను. ఒక్కొక్క దళమునఁ బదిమంది యశ్వికు లుండిరి. చివరిదళమున మాత్రి మైదుగురే యుండిరి. ఆదళము తూర్పు

దిక్కునుండి వచ్చెను. ప్రభువు నునికి యెఱింగియే యచ్చటికి వచ్చెను.

రోణంకిలో నా దళమునకు నగ్నిశర్మ తటస్థపడెను. ఆయన యగ్నిస్వామి మేనమామ. ఆయన రోణంకినుండి దంత పురమునకుఁ బోవుచు నాదళము నూరివెలుపలఁ గలిసికొనెను. సింహలాంఛనములు ధరించి యుండిన యాశ్వికులను గాంచి యాయన వారు విష్ణుకుండిన భటులని భ్రమపడెను. వారి యెదుట నిలిచి రెండు చేతులను బైకెత్తి "ఇంద్రభట్టారక మహారాజాధిరాజునకు జై" యని యఱచెను. ఆశ్వికుల మొగముల నొకధూమరేఖ యిట్టె పొడమి యట్టె యడగిపోయెను. దళనాయకుఁడు చిఱునవ్వు తెచ్చికొని యిట్లనెను.

"ఏమి బ్రాహ్మణోత్తమా ! మీ రాజు జీవించియుండఁ గనే పరరాజునకు జయవెట్టుచుంటివి ?"

"అయ్యో ! ఇంకెక్కడి మా రాజు ? ఆయన యప్పుడే పద్మనాభదేవుని సన్నిధానమును జేరుకొనెను గదా. నేఁడీ కళింగములకుఁ బ్రభు వింద్రభట్టారకుఁడే ! ఇంతకును మేము రాజోపజీవులముగాముగదా ! వేదోపజీవులకు రా జెవ్వఁడైన నేమి ? ఇంద్రవర్మ రాజైనచో నింద్రవర్మకు స్వస్తి. ఇంద్ర భట్టారకుఁడు రాజైనచో నింద్రభట్టారకునకు స్వస్తి."

"మా ప్రభువు నాజ్ఞచే మే మింద్రవర్మ మహారాజు నన్వేషించుచున్నాము. ఆయనను గుఱించి నీకేమైనను దెలిసి

నచోఁ జెప్పుము. ఇంద్రభట్టారకునిచే నీకు గొప్ప బహుమతి యిప్పింతును".

"చెప్పితిని గదటయ్యా! ఇంద్రవర్మ యిప్పుడే పద్మనాభ స్వామి సాన్నిధ్యమును జేరెనని. ఈ శుభవార్త నింద్ర భట్టారకున కందఁజేసి యాయనవలన నగ్రహారము ప్రతి గ్రహింపవలెనని కదా నేను బయలు దేరితిని. ఆడఁబోయిన తీర్థ మెదురైనట్లు మీరు నా భాగ్యవశమున నెదురైతిరి. నాకు నడకబాధ తప్పినది. మీకుఁగూడ త్రిప్పుట బాధ తప్పినది. నన్నింద్రభట్టారకుని వద్దకుఁ గొనిపొండు. ఈ శుభవార్త నాయనకు నివేదింతును.

"బ్రాహ్మణుఁడా! నీ వింద్రభట్టారకు నెఱుంగనట్లు న్నావు. ఆయన మహాక్రూరుఁడు. నీ వంటి రాజద్రోహి నాయన నిలువునఁ జీల్పించును సుమా!"

"రాజద్రోహి యెవ్వఁడు? నేనా? నీవా? నే నింద్ర భట్టారకునికి శుభసందేశ హర్తను. నీ వాయనను క్రూరుఁడన్న ద్రోహివి. మీతో నాకుఁ బనిలేదు. నే నాయన దర్శనమున కిదే పోవుచున్నాను. ఆయన నన్నుఁ జీల్పించునో నిన్నే చీల్పిం చునో అదియుఁ జూతువుగాక".

ఇట్లని నగ్నశర్మ బయలుదేరుచుండగా దళనాయకుఁ డాయన నడ్డగించి "ద్రోహీ! నిలువుము. ఎచ్చటికిఁ బోదువు? సింహలాంఛనములు గాంచి మమ్ము విష్ణుకుండిన భటులను కొని ప్రేలితివి. ఇంద్రభట్టారకుని దగ్గఱకుగాదు, నిన్నిప్పుడే

ఇంద్రవర్మ మహారాజు సన్నిధికి బంపుదును చూడుము" అని యాత్రికులకు సంజ్ఞ గావించెను. వారాతనిని బట్టి పెడ రెక్కలు విఱిచి బంధింపఁ దొడఁగిరి. నగ్నశర్మ కప్పు డర్థమైనది వారు కళింగ రాజభటులని. ఆయన యొక్కసారిగాఁ బకపక నవ్వఁ దొడఁగెను. దళనాయకుఁ డాయనవంక నుఱిమిచూచెను. నగ్నశర్మ మఱింత నవ్వెను. దళనాయకునివంకఁ జూచి "అయ్యా! రెండుచేతులు గట్టివైచితిరి గనుక అడుగవలసివచ్చి నది. ఈ రొండిన పొడుముకాయ యున్నది. చిటికెడుపొడుము దీసి యీ ముక్కుల కందించి పుణ్యము గట్టుకొందువా?" అనెను.

దళనాయకున కొడలు మండిపోయెను. నగ్నశర్మ మరల నవ్వుచు నిట్లనెను. "కళింగరాజు బ్రాహ్మణుఁడు. నేనును బ్రాహ్మణుఁడను. నీవు కళింగ రాజభటుడవు. నీవు బ్రాహ్మ ణుని గట్టుటయే పాపము. కొట్టుట మాట చెప్పనేల? అంతటి పాపమున కొడిగట్టి కొట్టినఁ గొట్టుదువుగాని ముందొక్క పట్టు పొడుమీ ముక్కులలోఁ బెట్టి కాసింతపున్నెము గట్టుకొనుమా" యనెను.

నగ్నశర్మ ప్రవర్తనము దళనాయకునకు వింతగొల్పెను. అతఁ డశ్వము నవరోహించి నగ్నశర్మ రొండినున్న పొడుము పెట్టెను దీసెను. ఆ పెట్టెలో పొడుములేదు. వృషభలాంఛన మున్నది. దళనాయకుఁడు నగ్నశర్మవంక తెల్లబోయి చూచెను.

నగ్నశర్మ "మహేంద్ర మహీధరాధిపతి ఇంద్రవర్మకు స్వస్తి" యనెను.

పెడవిఱిచిన ఱెక్కల చిఱుతనొప్పులు తడవుకొనుచు నగ్నశర్మ యున్నవిషయ మంతయు దళనాయకునకుఁ జెప్పెను. ఇంద్రభట్టారకుఁడు దండయాత్ర తీవ్రతను దగ్గించు నట్లు చేయుటకై యింద్రవర్మ మరణించి నట్లాతనికి వార్త నందజేయుమని యగ్నిస్వామి తన్ను నియోగించినట్లుకూడ తెలిపి వారిని మధుకాంతారమున కంపి నగ్నశర్మ తా నింద్ర భట్టారకుని దర్శింప బయలుదేరెను.

ఆ దళము మధువనోపాంతముల కేఁగుసరికి గర్సడాతోఁ దిరిగి వచ్చుచున్న విష్ణుకుండిన దళ మెదురయ్యెను. రెండుదళ ములును సింహలాంఛనములనే ధరించి యుండెను. రెండుదళ ములకు నడుమ నేఁబదిగజముల దూరముకూడ లేదు. ఎక్కడి దళ మక్కడనే నిల్చిపోయెను. ఒక్క క్షణ మట్లు నిలిచిన యనంతరము విష్ణుకుండిన దళనాయకుఁడు నాలుగడుగులు ముందునకు వచ్చి యొఱలోని ఖడ్గమును పెఱికి కుడిచేతితోఁ బైకెత్తి పట్టెను. కళింగ దళనాయకుఁడు మూఁడడుగులు ముందునకు వచ్చి బల్లెమును పైకెత్తి గిఱ్ఱునఁ ద్రిప్పెను. విష్ణు కుండిన దళనాయకుఁడు కన్నుబొమలు చిట్లించెను. కళింగ నాయకుఁడు చిఱునవ్వు నవ్వెను. విష్ణుకుండిన నాయకుఁడు "ఇంద్రభట్టారక మహారాజునకు జై" యనెను. కంళింగ నాయ

కుఁడు "ఇంద్రాధి రాజునకుఁ జై" యనెను.

విష్ణు కుండిన నాయకుఁడు కరవాలమును ముమ్మారు వాయుపథమునఁ ద్రిప్పి యశ్వమును దూకించెను. కళింగ నాయకుఁడు భల్లపు ములికి కర్ణమూలము నంటఁజేయి వెనుకకు సాచి తన యశ్వమును ఎడమచేతి మీఁదుగా దుమికించెను. విష్ణుకుండిన నాయకుని గుండెలలో బల్లెము కూరుకొని పోయెను. కళింగనాయకుని దక్షిణహస్త మాబల్లెమున వ్రేలాడుచుండెను. ఉభయదళములకు దొమ్మి జరిగెను. అటుసగము ఇటు సగము తెగిపడిరి.

దూరమున నశ్వముల డెక్కల చప్పుడు విన వచ్చెను. ఏదో అశ్వదళము వచ్చు చున్నది. అది యెవ్వరిదో. ఎవ్వరిదైనను రెండవ పక్షము సర్వనాశనమగును. విష్ణుకుండిన దళము దంతపురము దిక్కునకును కళింగదళము మధుకాంతారములోనికిని దవుడు తీసెను. కళింగ దళనాయకుఁడు చేయితెగి యచ్చటనే పడి యుండెను.

అగ్నిస్వామి, కళింగ దండనాధుఁడు, మంత్రులు నూర్గురాశ్వికులు నచ్చటికి వచ్చి చూచిరి. పడియున్న కళింగ దళనాయకుఁ డెడమ చేతితోఁదడవి నడుమునఁ గట్టి యున్న వృషభ లాంఛనమును బ్రకటించెను. నడచిన వృత్తాంతము నాలుగు మాటలలోఁ జెప్పి స్పృహతప్పి తూలిపోయెను. విష్ణుకుండిన భటుల కళేబరములను దిగువలోయలోనికిఁ దోఁచివైచి తమ

భటుల కళేబరములను, స్వ ప్రహాతప్పిన దళనాయకుని నశ్వము లపైఁ బెట్టుకొని వారు మధు వనమున మఱుఁగుపడి పోయిరి.

నగ్నశర్మ దంతపుర దుర్గమును ముట్టడించి యున్న విష్ణు కుండిన స్కంధావారములోనికిఁ బోయెను. "ఇంద్రభట్టారకు లకు జై" యని యఱచుచుఁ బటకుటీరముల నడుమఁ బరువులు పెట్టుచుండెను. పహరాభటు లాయనను బట్టుకొని పడవాలున కప్పగించిరి. ఆతఁడు ఆయన కథవిని దళనాయకున కప్పగించెను. ఆతఁడు సేనాపతి కప్పగించెను. ఆతఁడు ప్రధాన దండ నాధుని కప్పగించెను. ఆతఁడు నగ్నశర్మ కథ సవివరముగ విని ఇరువురు సేనాపతులనుఁ దోడిచ్చి యాయనను ప్రభువు సన్నిధి కంపెను.

ఇంద్రభట్టారకుఁడు దంతపురపు ముట్టడి దండనాధుని చేతులలో నుంచి తాను పురణి సంగమమున విశ్రాంతికై విడిసి యుండెను. సేనాపతులు నగ్నశర్మతో రాజకుటీరమును జేరు నప్పటికి ఇంద్రభట్టారకుఁడు మాధవవర్మ సైన్యాభీతుని మంత్రితో మంతనము లాడుచుండెను. ఇందర్రిభట్టారకుని దండ యాతర్రి నిరాఘాటముగ సాగుటకు సైన్యాభీతుని సహాకార మొక పర్రిధాన కారణము. సైన్యాభీతుఁ డొకవంక భవదేవ రణకేసరిని గదలకుండ నిలువరించి వేఱొక వంక మహేంద్రగిరి పై గాలూదుటకు సన్నాహము లొనరించెను. దీనివల్ల ఇంద్ర భట్టారకునకు వాకాటకములందును, కళింగములందును

య్యాత్ర చాలవఱకు సుకరమయ్యెను. దక్షిణ మధ్య కళింగము లింద్రభట్టారకుఁ డుంచుకొని యుత్తర కళింగమును దనకు వదలి పెట్ట వలెనని సైన్యాభితుఁడిప్పుడు ప్రతిపాదించెను. "కళింగ మును బూర్తిగాఁదనకు వదలి మహాకోసలములు సైన్యాభీ తుఁడు గెల్చికొనఁ గూడదా" యని యింద్రభట్టారకుఁడు ఎదురుప్రతిపాదన గావించెను." "ఆ విషయమునఁ గొంగొడయుఁ గోసలములును దమ బలాబలములు చూచుకొనును. ఉత్తర కళింగము మాట తమరు తేల్చవలె" నని కొంగొడ మంత్రి యొత్తిడి పెట్టెను. "కళింగ రాజు సంగతి తేలక ముందే కళింగ ముల పంపిణీకి తొందరయే" మని యింద్రభట్టారకుఁడు ఒక పుడక నడ్డువైచెను. "చతుర్దశభువనము లందెచ్చట దాగినను కళింగరాజును బట్టితెచ్చు భారము మాది" యని కొంగొడ మంత్రి యా పుడక నిట్టె త్రుంచి వైచెను. మీ భారము మీరు తీర్చిన నాఁడు ఈ బేరము మాత్రము తీరకుండునా? "యని ఇంద్రభట్టారకుఁడు మరల నొక ముడివైచెను. కొంగొడ మంత్రి కను బొమలు సన్నగా ముడివడు చుండుట యింద్రభట్టారకుని కంటఁబడకపోలేదు. ఆయన చిఱునవ్వుచు నది యొకతీరుగా కనుబొమలు విఱుచు కొనెను.

"భ్రూభంగాకార వినిర్ధూత సమగ్రదాయదా! జయ!! స్ఫురన్నిశిత నిస్త్రింశ ప్రభావభాసి తాశేష జగన్మండ లాధి ష్ఠితా! జయ!! అనేక చతుర్దంత సమర సంఘట్ట ద్విరదగణ

విపుల ! విభవా ! జయ !! చతురుదధి నృపతిమకుట మణి మయూఖ విస్ఫురిత పాదాంబు రుహ ! జయ !! సకల దక్షిణా పథపతీ ! జయీభవ !! విజయీభవ !!" అను కైవారములు కుటీరాంగణమున వినవచ్చెను. ఇంద్రభట్టారకుఁడు కొంగోఁడ మంత్రి దెసఁదిలకించెను. ఆతని ముఖమునఁ జిఱునవ్వు పొగ మంచువలె దట్టముగ నావరించి యుండెను.

ఇంద్రభట్టారకుఁడు ద్వారపాలకునకుఁ గనుసన్న గావించెను. సేనాపతులు, నగ్నశర్మతోఁ గుటీరమునఁ బ్రవేశించిరి. నగ్నశర్మ యింద్రభట్టారకునకు మరల స్వస్తిపలికి తన సందేశము వినిపించెను.

"ఇంద్రవర్మ యొక శబర యువకుని విసపుటమ్మున హతుఁడయ్యెను. ఆయన శరీరము నేపులియో యెత్తుకొనిపోయి యుండును. ఆయన యుష్ణీషము మాత్రము దొరికినది. శబరపతి పుళిందసేనుఁడా యుష్ణీషమును దమ కందఁజేయుఁ డని నన్నును. నామేనల్లుడు అగ్నిస్వామిని నియోగించెను. రోణంకి ప్రాంతములఁ గళింగరాజు నాశ్వికదళము మమ్ముఁ జుట్టుముట్టి పట్టుకొనెను. ఉష్ణీషము మా యగ్నిస్వామి కడ నుండుటచే నాతనిని బంధించి కొనిపోయిరి. నేను వట్టి బాటసారినని బొంకుటచే నన్ను విడచిపెట్టిరి. దేవర కీ శుభవార్త నందించి కృతార్థుఁడనైతిని."

నగ్నశర్మ సందేశము ముగియుచుండఁ గుటీరము వెలుపటఁ గలకల మయ్యెను. అన్వేషణ దళనాయకుఁడు దర్శన మపేక్షించుచున్నాఁడని ద్వారరక్షకుఁడు ప్రభువునకు విన్న వించి యాయన కనుసన్నపై దళనాయకుని బ్రవేశపెట్టెను. దళనాయకుఁడు తాను దెచ్చిన వార్తను ప్రభువునకు నివేదించెను. కళింగరాజు బాణముతోఁ గొట్టిన శబరయువకుని దిలకించుటకై ప్రభువు కుటీరము వెలుపలికి వచ్చెను. ఆయన వెంట మిగిలినవారును వచ్చిరి. "ప్రభూ! కళింగరాజును గొట్టిన శబర యువకుఁ డీతఁడే'' అని నగ్నశర్మ గర్సడాను ఇంద్రభట్టారకునకుఁ జూపెను.

గర్సడా వంగి ప్రభువునకు నమస్కరించి "ప్రభువా! కళింగరాజును గొట్టినది నేనే. ఈ యమ్ముతోడనే కొట్టితిని.'' అని పొదిలోని యమ్మును దీసి ప్రభువున కందించెను. ఇంద్రభట్టారకుఁ డా యమ్మున విసమును వెంటనే పసికట్టెను. గర్సడా వంక నవ్వుచుఁ దిలకించెను. వాఁడు ''ప్రభువా! గర్సడా గుఱికిఁ దిరుగులేదు. గర్సడా యమ్ముపమ్మగుట యన్నదిలేదు. పరీక్షింతురా?'' యని వింట నమ్ము తొడిగి గుఱిచూడసాగెను.

''దేనిని గుఱి చూచుచున్నావు ?'' అని రాజనెను.

''కళింగరాజు తలపాగ మీ యొద్ద నున్నది కదా! దానిని దెచ్చి యల్లంత దూరమునఁ బెట్టుఁడు. నేను దానిని మరలఁ గొట్టి చూపింతును.'' అని గర్సడా యనెను.

"కళింగరాజు పాగ యేది ?"

"మా మామ తమకుఁ బంపెను గదా."

"ఎవనితోఁ బంపెను ?"

"మా పురోహితుఁ డగ్నిస్వామి గారితో"

"నీ వీయన నెఱుఁగుదువా ?" అని ఇంద్రభట్టారకుఁడు నగ్నశర్మను జూపెను.

"ఓ. ఎఱుఁగ కేమి? ఈయన మా పురోహితుని చుట్టమే"

ఇంద్రభట్టారకునకు నగ్నశర్మయందు నమ్మిక గుదిరెను. "నీవు పడిన శ్రమయంతయు వృథాయైనది. కళింగభటు లగ్ని స్వామిని, ఉష్ణీషమును బట్టుకొని పోయిరి. నీవే యా యుష్ణీష మును బట్టుకొని రాకపోతివా ?" అని ప్రభువు గర్వడాంతో నడెను.

"నీవు కళింగరాజును విసపుటమ్మునఁ గొట్టితివి. కళింగ భటులు వచ్చి నిన్ను బట్టుకొని పోదురేమో యని నన్ను మా మామ యిల్లు గదలనీయలేదు."

అప్పుడు దళనాయకుఁ డందుకొని యిట్లనెను. "నిజమే ప్రభూ ! కళింగభటులు దేశమంతయు దిరుగుచున్నారు. సింహ లాంఛనములు ధరించి మన భటులనుగూడ వంచించు చున్నారు. మేమొక దళముతోఁ దారసిల్లి దొమ్మియుద్ధమున నిరువదిమందిఁ పదిమంది మైతిమి."

నగ్నశర్మయందు ప్రభువునకు సంపూర్ణ ప్రత్యయము గలిగెను. ఆయన గర్సడావంకఁ జూచి "మరి యిప్పుడెట్లు వంపెను." అని ప్రశ్నించెను.

"నీవు విష్ణుకుండిన రాజునకు గొప్ప యుపకారము చేసితివి. ఆయన నిన్ను మెచ్చి బహూకరించును. నీవు పోయి యా రాజునకు మన శబరుల మైత్రిని దెలిపిరమ్మని మా మామ నన్ను తమ శబరుల వెంట నంపెను." అని గర్సడా బదులు చెప్పెను.

"సరే. మేము శబరరాజు మైత్రి నంగీకరించితి మని చెప్పుము. నీకు బహుమాన మేమి కావలెనో కోరుకొనుము."

గర్సడా సిగ్గు లొలుకఁబోయుచు నేలచూపులు చూచు చుండెను.

"భయములేదు. కోరుకొనుము" అని ఇంద్రభట్టారకుఁడు ప్రోత్సహించెను.

"ప్రభువు మా మామతోఁ జెప్పి నాకొకటి యిప్పించవలెను" అని గర్సడా కులుకుకొనుచు ననెను.

"అట్లే యిప్పింతును. చెప్పుము."

"నా కింద్రాణి కావలెను."

"ఇంద్రాణి యనఁగా"

గర్సడా మరలు సిగ్గు నభినయించెను. ఇంద్రాణియుఁ జౌదంతియు వాని నాలుక తుదవఱకు వచ్చి యేలనో ఆగి పోయెను.

''ఇంద్రాణి పుళిందసేనుని ఏకైక పుత్రిక'' అని నగ్న శర్మ యందుకొని యనెను.

''అయినచో నభ్యంతరమేమున్నది. నగ్నశర్మగారూ! తమరు నా మాటగాఁ బుళిందసేనునితోఁ జెప్పి గర్వడా కోర్కి నెరవేర్పుఁడు.''

''చిత్తము''

ఇంద్రభట్టారకుఁడు చక్కఁగా వంచితుఁ డయ్యెనని నగ్నశర్మ పరమ సంతృప్తుఁ డయ్యెను. ఆయన యొద్ద సెలవు తీసికొని గర్వడాను వెంటఁ బెట్టుకొని నగ్నశర్మ మధువనము నకు బయలుదేఱెను.

దారి పొడవునను గర్వడాకు ఇంద్రాణితోఁ ధాను చౌదంతి నెక్కి యూరేగుచున్నట్లే యనిపించెను. మధువన మును బ్రవేశించిన మరు నిముసము వాఁడు నగ్నశర్మ చూపు నకుఁ బిలుపునకు నందలేదు.



మహా కాంతారవాసులైన ఖోదు, ముండ, గాండు, భిజ్జల, కోలు, భూమియాలు, ఓలయాను, పానో, నాగజాతుల నాయకులు శబరపతి మందిరమున సమావిష్టులై పుళిందసేనుని వలనఁ గళింగ రాజ్య పరిస్థితులు వినుచుండిరి. ఒక్కొక్క జాతి యైదువందల మంది చొప్పున సమకూర్చి యైదువేల సేన తక్షణము ఏర్పాటు చేయవలెను. ఈ సేన యంతయుఁ బద్మనాభ పర్వత ప్రాంతముల సమీకృతమై యుద్ధ శిక్షణ పొందవలెను. కళింగసైనికులు వారికి శిక్షణ నిత్తురు. అశ్వారోహణ గజారోహణాదులు వారికి నేర్పఁబడును. ఏదళమున కాదళము తగినన్ని విండ్లు నమ్ములు. ఆహారపదార్థములు సమకూర్చుకొన వలెను. దశమి నాఁటికి దళములన్నియు నిర్దిష్టస్థానమున సమీకృతములు గావలయును.

తదియనాఁడుదయము పద్మనాభగిరిపై ఇంద్రవర్మ కొలువు దీర్చెను. కోవెల యెదుటి పురాతన వట వృక్షము కొలువు కూటము. వందగజముల దూరమున షుమారు రెండు వందలమంది వీరభటు లశ్వారూఢులై బారులు తీరియుండిరి. వారి ముందు నాలుగు వందల మంది శబరవీరులు విల్లంబులు ధరించి నిలిచి యుండిరి. కళింగదండనాథుఁడు భానుసింహుఁడు సావధానుఁడై యా ముందు నిలిచి యుండెను. ప్రభువున కిరు

దెసల నిరువురు మంత్రులు, ప్రభువు నగ్రమున నగ్నిస్వామి, యాయన వెనుక దశవిధ శబర జాతుల నాయకులు. ప్రభువు వామ భాగమున నిందాణి. పుళింద సేనుని కన్నులానందమున మిలమిలలాడి పోవుచుండెను. కళింగరాణి తన బిడ్డ! పుళింద సేనుఁడు తన శబరత్వమును మఱచి పోవుచుండెను.

అగ్నిస్వామి లేచి ప్రభువునకు నిందాణికిని స్వస్తిపలికి యిట్లనెను.

"మహాప్రభూ! మహా కాంతారవాసులైన ఈ శబర జాతుల వారు మొదటి నుండియుఁ గళింగములకుఁ గనుఱెప్ప లుగా నుండిరి. కళింగములకీనాఁడు వాటిల్లిన కష్టదశకు వీరెల్లరుఁ దల్లడిల్లు చున్నారు. తమ సర్వస్వము నొడ్డియైనఁ గళింగము లను గాపాడుటకు వీరు బద్ధ కంకణులై యున్నారు. ప్రభువు వీరి సేవల నంగీకరింతురు గాక!"

పుళింద సేనుఁడు మున్నుగా శబరనాయకు లొక్కొక్కరు ప్రభువు పాదములంటి రాజభక్తి ప్రమాణము గావించిరి. తనకు నమస్కరింప వచ్చు వృద్ధ పుళింద సేనుని వారించి ప్రభు వింద్రాణీ సహితుఁడై యాయన పాదముల చెంతఁ బ్రణమి ల్లెను. శబరనాయకు లెల్లరు నొడళ్ళు జల్లు జల్లున బులకరించిరి. పుళింద సేనుఁ డానందాతిరేకమున నాపాద మస్తకము గంపించి పోయెను. అగ్నిస్వామి యాయనను బట్టుకొని మెల్లగాఁ గూర్చుండఁ బెట్టెను. ఇంద్రాణీ సహితుఁడైన ప్రభువు దేవేం

ద్రుని వలెను, దామెల్లరును గంధర్వపతుల వలెను శబరనాయకులకుఁ జిత్తముల భాసించెను.

"జై యింద్రవర్మ మహారాజునకు జై" యనుశబ్దము నింగి ముట్టెను. వేయి యేనుంగు లొక్కుమ్మడి ఘీంకరించినట్లా శబ్దము కీచక వనమునఁ బ్రతిశబ్దమీనెను.

ప్రభు వింద్రాణీ సహితుఁడై లేచి నిలువఁ బడెను. భూదేవీ సహితుఁడగు పద్మనాభ దేవుఁడు దేవళము వెడలి వచ్చి వట వృక్ష మూలమున దర్శన మిచ్చి నట్లు పుళిందసేనుని భావనలోఁ దళుక్కుమనెను. ప్రభువు వామహస్తము నింద్రాణి నడుమునఁ జుట్టి దక్షిహస్తమెత్తి యిట్లనెను.

"శబరనాయకుల బలము కళింగములకు వేయి యేనుంగుల బలము. కళింగములు కష్టములుగడచి గట్టెక్కినట్లే మాకుఁ దోఁచు చున్నది. మహేంద్రగిరి గోకర్ణేశ్వరుఁడు మధువనమున ముఖలింగేశ్వరుఁడై వెలసెను. ఆయన కళింగదైవము. ఇంక ముందు ముఖలింగమే కళింగరాజు నగరము. గంగామలకుల మున కీ జయంతి క్షేత్రము విజయక్షేత్రము.

దక్షిణాపథమిప్పుడొక చదరంగపుఁ బలకవలె నున్నది. సకల దక్షిణాపథ పతిత్వమునకుఁ బది యేండ్లలో నిది రెండవ యత్నము. అపరాంతత్రైకూటకులు, చేదికాలచూర్యులు, మహాకోసల కేసరులు, కళింగ గంగాన్వయులు, వేంగి విష్ణుకుండినులు, కాంచీపుర పల్లవులు, కుంతల కదంబులు, వాతాపి

చాళుక్యులు నెనిమిది దిక్కుల నాక్రమించుకొని యున్నారు. మధ్య దేశములు వాకాటకుల యధీన మందున్నవి. వాకాటక హారిసేన చక్రవర్తి దిగ్విజయ మొనరించి సకల దక్షిణాపథ పతి యనిపించుకొనెను. అది దక్షిణమున విష్ణుకుండినునకు, నుత్త రమునఁ గాలచూర్యునకుఁ గన్నెఱ్ఱ పుట్టించెను. ఇరువురును అధిక గజబల సంపన్నులు. ఐననేమి ? హారిసేనుఁడు సింహబ లుఁడు. పది యేండ్లుగా నీ యేనుంగుల యాట సాగలేదు. వాకాటక సింహము వార్ధక్య పరాభూతమగు వఱకుఁ బొంచి యుండుట యా యిరువురకును దప్పలేదు. విష్ణుకుండినుఁడు కదంబునితోఁ గలిసి నేఁడా సింహమును గూలఁద్రోసెను. వాకా టక కళింగముల నేకము గావించి పాశ్చిమసాగరముల నొరసికొను నా మహా సామ్రాజ్యమున మితవర్మ సంతాన మును సుప్రతిష్ఠితము చేయవలె ననుకొన్న హారిసేనుని స్వప్నము లీ నాఁ డిట్లు శకలములైనవి. మా జయావళి...." ప్రభువు భాషణము హఠాత్తుగాఁ నర్ధోక్తిలోఁ దునిగి పోయెను. ప్రభువు ముఖము క్షణములోఁ గందిపోయెను. ఆయన యక్షు లర్ధనిమీలితములయ్యెను. ఆనన మీషదవనతమయ్యెను. ప్రభు వుద్విగ్నుఁడైనట్లు స్పష్టపడెను.

అగ్నిస్వామి లేచి ప్రభువు దక్షిణ పార్శ్వమున నిలిచి యిట్లనెను. "ప్రభువు చిత్తము పదిల పఱచు కొందురుగాక ! సెలవైనచో వక్తవ్య శేషమును నేను సభకు నివేదింతును"అనెను.

ఇంద్రాణి యుద్విగ్నురాలై న ప్రభువు ముఖములోనికిఁ జూచెను. ఆయన కన్నులెఱ్ఱదామరలవలె నుండెను. ప్రభువు తన కంటి కొలికి యందలి ముత్తెమును జిటికెనవ్రేలఁ జిందుచు నింద్రాణి నడుమున మరింత దృఢముగ నొత్తిపట్టుకొనెను. ఇంద్రాణి ప్రభువు వామపార్శ్వమున నింద్రనీల ధనువువలె నుండెను. అగ్నిస్వామి యాయన దక్షిణ పార్శ్వమున బ్రహ్మాస్త్రమువలె నుండెను.

అగ్నిస్వామి యిట్లనెను :

"జయావళి హరిసేన మహారాజు నేకపుత్రిక. వాకాటక సామ్రాజ్యమునకు వారసురాలు. ఈ ప్రభువునకు వాగ్దత్త. ఇందప్రభట్టారకుఁడామెను గామించి, సామ్రాజ్యముఁ గాంక్షించి మధ్యదేశములపై దండెత్తెను. హరిసేనుని వధించెను.

జయావళి యేమయ్యేనో తెలియదు. ప్రభువు నంతరంగమున నా యావేదన నిండియున్నది. రెండు మూఁడు దినములుగా నా చిత్తమునందొక వింత యూహ తారాడుచున్నది. విశాల భూభాగమైన యీ మహాకాంతార మేలచిరకాలముగా నలక్ష్మి పీడితమై యున్నది? ఈ క్షేత్రపాలకుఁడైన పద్మనాభ దేవుఁడు కేవలభూదేవీ సహితుఁడై యున్నాఁడు. శ్రీదేవి యాయనచెంత లేదు. ఆ దేవుని దక్షిణ పార్శ్వమున శ్రీదేవిని బ్రతిష్ఠింప వలయును. అప్పుడు మహాకాంతారమున సిరి తాండవింపవలెను. నన్నీ యూహ వదలకుండఁ బట్టుకొన్నది. ఇంద్రాణి

భూదేవి యంశమున నవతరించినదని మీరెల్ల రెఱుంగుదురు గదా. ఆమె ఇప్పుడు ప్రభువు వామపార్శ్వము నలంకరించినది. ప్రభువునకు రాజ్యప్రాప్తి తథ్యమైనది. దేవుని దక్షిణ పార్శ్వమున శ్రీదేవిని బ్రతిష్ఠించిననాఁడు ప్రభువు దక్షిణ పార్శ్వమున జయావళి వచ్చి నిలువగలదని నా యంతరాత్మ ప్రబోధించుచున్నది. శబరపతి యీ పనిచేయవలెను.''

సభయంతయు నా పలుకులువిని పులకలు తలమునుకలై పద్మనాభ దేవునకు, నింద్రవర్మ మహారాజునకుఁ బదింబదిగా జయ జయ ధ్వానము లొనరించెను. అశ్వములు ముంగాళ్ళు పైకెత్తి మధుర హేష లొనరించెను. ఆ హేషలకుఁ గీచకవనమున వేయి యేనుంగులు తుండములెత్తి ఘీంకారములతోఁ బ్రతి వచనము పలికెను. పద్మనాభ దేవుని యాలయ ఘంటికలు తమంతటఁ దామే గణ గణ మ్రోగెను. అగ్నిస్వామి యందుకొనెను :

''దక్షిణాపథ మొక చదరంగపుఁ బలకవలె నున్నదని ప్రభువు సమంజసముగ వర్ణించెను. విష్ణుకుండినుఁడు కదంబరవివర్మను, కొంగొడ సైన్యాభీతుని గదలించి, తానొక గుఱ్ఱపు దాటువైచి మన యాట కట్టించితివని మురియుచున్నాఁడు. ఎత్తువేయుట యిప్పుడు మన వంతు. కంచి పల్లవుని, వాతాపి చాళుక్యుని మనమిప్పుడు కదలింపవలెనని నాకుఁ దోచుచున్నది. కళింగ మంత్రు లాలోచించి నిర్ణయింప వలెను.''

శబరపురోహితుని బుద్ధివైశద్యమునకు కళింగ మంత్రు లాశ్చర్య పోయిరి. పల్లవ కదంబ రాజ్యముల వైర మొక దీర్ఘ వ్యాధి. అది యింతవరకెన్ని పర్యాయములు తిరుగఁ బెట్టెనో! ఇప్పుడు పల్లవులు కదంబ రాజ్యముపై దండెత్తవలెను. రవి వర్మ తన రాజ్యరక్షణకై మధ్య దేశములు వీడి తిరిగి పోవలెను. చేది కాలచూర్యు డప్పుడు గడి వీడును. వాతాపి చాళుక్యుఁడా తనికెదురు వచ్చును. మహాకోసలముల భవదేవరణకేసరి కప్పుడు కదల వీలగును. ఆతఁడు కదలినచో సైన్యాభీతుని గుండెలు గుభిల్లుమనును. మహా కాంతారము నుండి ఇంద్రవర్మ చౌదంతిపై నప్పుడు బయలు దేరును. దక్షిణ కళింగము నుండి పృథ్వీమూలుఁడు బయలు దేరును. వంశధారానాగావళి నదుల నడుమ నింద్రభట్టారకుఁ డొంటి కాలిపై జిందులు ద్రొక్కును. చదరంగపుఁ బలక యంతయు నొక్కసారి కదలి కల్లోలమగును. ఈ కల్లోలముపైఁ దేలియాడుచు జయావళి యెచ్చట నున్నను నిందర్రివర్మ మహా రాజును వచ్చి చేరును.

పల్లవరాజున కుత్సాహము వాతాపినుండి పోవలెను. అది సులభమే. చాళుక్యరణ రాగుఁడు పల్లవకుమారవిష్ణువు వల్లుఁడే. ఈ యెత్తు ఉభయులకు లాభదాయకమే. రణరాగుని వాతాపి యందు నిలిపినది హరిసేనుఁడే కదా.

పరిషత్తు వర్తమానము నిట్లు సమీక్షించి భవిష్యత్తు నిట్లు నిరూపించెను. కళింగ మంత్రు లిరువురు, నగ్నిస్వామియుఁ

గలిసి కార్యక్రమ వివరములు చర్చించి కర్తవ్యమునఁ బ్రవర్తిల్లు దురు. శబరనాయకు లెవరి రాజ్యమునకు వారేఁగి దశమినాఁటి కెవ్వరి దళముతో వారు వచ్చిచేరుదురు. పుళిందసేనుని పరివార మునకు నేఁటి నుండియే రణశిక్షణ యారంభమగును. దశమి నాఁడు పద్మనాభ దేవుని దక్షిణ పార్శ్వమున శ్రీదేవి ప్రతి ష్ఠింపఁబడును. కళింగ దండనాథుఁడు పోయి చెదరి యున్న కళింగ సైనికులను క్రమముగా మహాకాంతారగర్భమున సమీక రించును. ప్రభువు క్షేమవార్త, సమర సన్నాహ వార్త దంత పురపుఁ గోటలోనికి, మహేంద్రగిరి కోటలోనికి, నెప్పటికప్పుడు చేరునట్లు నగ్నశర్మ యేర్పాట్లు చేయును.

ప్రభువుకడ సెలవు పుచ్చుకొని యెవరి త్రోవను వారు పోయిరి. శబరనాయకులు స్వరాజ్యములఁ బట్టి పోయిరి. పుళింద సేనుడు, అగ్నిస్వామి, కళింగ మంత్రులు ముఖలింగము నకు బోయిరి. దండనాథుఁడు కళింగములకుఁ బోయెను. అశ్వ దళము, శబర భటులు కొండ దిగి పడమటి దిక్కునఁగల లోయ లోని కేగిరి.

ప్రభు విందాళిణీ సహితుఁడై పద్మనాభస్వామి యాలయ మండపమునఁ జౌదంతికొఱకు నెదురు చూచుచుండెను.



గర్భడా గుండెలు పగులునట్లు పరుగెత్తుకొని వచ్చి మందిరమంతయు వెదకి కొనెను. కాని వాని కింద్రాణి యగ పడలేదు. వాడంద్రాణిని జూచి యప్పుడే మూఁడు దినములు అయినది. వానికిఁ బ్రాణములు నిలుచుటలేదు. ఇంద్రాణియే కాదు వానికిఁ బుళిందసేనుఁడుగూడ కనఁబడలేదు. వాఁడు మందిరము వెడలివచ్చి ద్వారపాలకునడిగెను. వాఁడు తనకుఁ దెలియదనెను. వాఁడు పరుగు పరుగున నగ్నిస్వామి కుటీరమునకు బోయెను. అచ్చట షేడా అగుపడి "ఏమిట్లు తోడేలువలె ఒప్పుచున్నావు ?" అని పలుకరించెను. వాఁడు చిఱ చిఱలాడుచు "లోపలనింద్రాణియున్నదా?" యనెను. ఇంద్రాణియా! "ఇంద్రాణి ఇందుగ్రినియొద్ద నుండును. ఇచ్చట నెందులకు ఉండును ?" అని పరియాచకముగా ననెను. గర్భడా కొండ ముచ్చువలె గుఱ్ఱుమని 'ఇంకెచ్చటికిఁ బోవును ? పద్మనాభ గిరికే పోయి యుండు" నను కొని యా త్రోవఁ బట్టెను. శరీరము ముందునకురుకులు పెట్టుచుండెనే కాని చౌదంతి వాని మనస్సును వెనుకకు నెట్టుచునే యుండెను. దానితో వాని వడి కుంటువడెను. మరికొంత వడికి నడక జడను పడెను. కొండ కనపడుచున్న కొలఁదియు నడుగులు తడబడుచుండెను. ఇప్పుడు వాని మనస్సు ముందునకు బోవుచుండెను. కాని పాదములు వెనుకకు గుంజుచుండె.

ఇట్టి యవస్థలో వానికిఁ బుళింద సేనాదు లెదురు పడిరి. వానికి ప్రాణములు కుదుటఁ బడెను. ఇంద్రాణి వారిలో నుండెనని వాడాశపడెను. కాని యామె యేది? పైగా రాజు పురుష వేషధారులీ యిరువురు నెవ్వరు?

పుళింద సేనుఁడు గర్సడా జూచి నవ్వుచు "వచ్చితివా? వెళ్ళిన పని యేమయినది?" అని పలుకరించెను. పుళింద సేనుని నవ్వుమొగము వాని ప్రాణములకుఁ జల్లగాఁ బెండ్లి పందిరి వలె నుండెను.

"ప్రభువు నన్నెంతో మెచ్చుకొనెను."

"నేను చెప్పలేదా? మెచ్చునని"

"అచ్చట మన యగ్ని స్వామిగారి మామగా రగపడిరి. నీవు పంపిన పాగ కళింగ సైనికు లపహరించిరని యాయన చెప్పెను. ఈ యగ్నిస్వామిగారిని కూడ బట్టుకొని పోయి రట గదా? మరి యీయన యిచ్చటి కెట్లు వచ్చిరి?"

"ఎట్లో తప్పించుకొని వచ్చిరిలెమ్ము. ఇంతకును ఆ రాజు మెచ్చి నీ కేమిచ్చెను?"

గర్సడా సిగ్గుచేఁ గొంకరలు పోవుచుఁ దల వంచుకొని యూరకుండెను.

"పెండ్లికూఁతురువలె సిగ్గుపడెదవు? ఆ రాజు నెదుట గూడ నిట్లే యభినయించితివా?"

పుళింద సేనుని పలుకులు చురుక్కునఁ దగిలి గర్నడా "లేదు మామా? పుళింద సేనునకుఁ దగిన యల్లుఁ డనిపించి తిని. నేను చెప్పుకొనుటెందులకు? నగ్నిశర్మగా రిప్పుడే యంతయుఁ జెప్పుదురు గదా?"

"ఆయన గూడ వచ్చిరా?"

"ఆ"

"సరియే. నడువుము"

గిర్నడా నడచు చుండెను. కాని వానికి నడువ వలెనని లేదు. ఇంద్రాణి యేదని యడుగ వలెనని వాని కున్నది. కాని యడుగలేడు. వాఁడు వెనుకఁబడ జూచును కాని పుళింద సేనుఁడు వానిని ముందు నడిపించును. వాఁడు మామపైఁ జిడి ముడి పడును. కాని పైకగపడనీయక యణచుకొనును.

అగ్నిస్వామి వానిని పదియడుగులు ముందు నడిపించి జరిగిన యుదంత మంతయు వానిచేఁ బలికించెను. "మీ మామ యా ప్రయత్నముననే యున్నాఁడు. ఈ యిరువురు నిందరిభట్టారకుని మంత్రులు. ఆయన నీ పెండ్లి సంగతియే వీరితోఁ జెప్పి పంపినాఁడు. ఇంద్రాణితో నీ విషయమనఁగా నామె కెక్కడ లేని సిగ్గు ముంచుకొని వచ్చినది. పెండ్లినాఁటి వఱకు నామె నీ కగపడదు. నీవు తొందర పడకుము" అని వానిని బుజ్జగించెను. అగ్నిస్వామి

మాటలు వినుచున్న కొలఁదియు గర్సడాకుఁ గోటి స్వర్గము లెక్కినట్లుండెను.

నా నాఁటికి మధుకాంతార మొక మహాస్కంధా వారముగాఁ బరిణమించుచుండెను. దినమునకుఁ బదుగురు నిరువండ్రవంతునఁ గళింగ భటులు వచ్చి చేరుచుండిరి. దశమి నాఁటికి కళింగ సేన రమారమి వేయి యయ్యెను. అశ్వికులు నాలుగు వందలు, కాల్బల మాఱు వందలు. వీరికిఁ దోడుగా నాటవికసైనికు లొక యైదువేలమంది ప్రోవు పడిరి. వీరికి యుద్ధ పద్ధతులు నిర్విరామముగ నేర్పఁబడు చుండెను.

దశమినాఁటియుదయముననే పుళిందసేనుఁడు శ్రీదేవి విగ్రహము పద్మనాభగిరి పైకిఁ జేర్పించెను. అగ్నిస్వామి సమంత్రకముగా నా మూర్తిని బద్మనాభదేవుని దక్షిణపార్శ్వ మునఁ బ్రభువుచేఁ బ్రతిష్ఠ చేయించెను.

ఇంద్రవర్మ ప్రతిదినమును జౌదంతిని దిలకించుచునే యుండెను. ఇంద్రాణి పిలుపు విని యది వచ్చి బండరాతి మరుగున నిలిచి తుండమెత్తి బుస్సలు కొట్టును. ఆమె దానిని 'రా, బా బా. రా' యని బుజ్జగించును. దానికి వాయుపథ మంతయు మనుష్య వాసన కొట్టుచుండెఁగా వలయును. తుండము నెత్తి యూరక పసిచూచును. మందమంద ముగా గురగురలాడును. పది యడుగులు ముందునకు

వచ్చును. మరల నంతలో గిఱ్ఱునఁ దిరిగి గీ పెట్టుచు నడవిలో గలసి పోవును.

దశమినాఁ డింద్రాణియు నింద్రవర్మయు నాలయ మండపమున నిలుచుండిరి. ఇంద్రవర్మ తన చేతుల నింద్రాణి నడుమునకుఁ జుట్టి యుండెను. ఆ చుట్టుట యామె కటిచక్ర మునఁ గాంచన కాంచీదామము పెట్టి నట్లుండెను. ఇంద్రాణి తన బాహువుల నింద్రవర్మ కంఠమున వ్రేలవైచెను. ఆ వ్రేల వైచుట యాయనగళమున నింద్రనీలమణి హారమును గీలించినట్లుండెను. ఇంద్రాణి యథా ప్రకారము చౌదంతిని బిలిచెను. అది వచ్చి రాతిబండ మరుగునఁ గొంచెముసేపు నిలిచి మెల్లగాఁ గదలి యీవలకు వచ్చెను. ఈ పదిదినములుగా దానికి నరవాసన యొంటఁబట్టెను గావలయును. అది గునగున నడచుచుఁ గొంత దూరము వచ్చి యాగిపోయెను. ఇంద్రాణి దాని కెదురేఁగి తుండమును చేతఁ బట్టుకొని యాలయ మండపము దగ్గరకుఁ దీసికొని వచ్చెను.

చౌదంతి యింద్రవర్మ యెడలు మూర్కొని యూర కుండెను. ఇంద్రాణి యుడుతపిల్లవలె దాని తుండము వెంట నెగఁబ్రాకి కుంభస్థలముపైఁ గూర్చుండెను. చౌదంతి గిఱ్ఱునఁ దిరిగి యడవిలోనికిఁ బోయెను. ఇంద్రాణి దానిని నేఁడు కీచకవనమున నేనుంగుల గుంపులలోనికి నడిపించెను. ఆ యేనుంగు లామెను గాంచి బెదరుచూపులతోఁ బారిపోవ

యత్నించెను. చౌదంతి వాని నదలించి నిలువరించెను. ఇంద్రాణి యా యేనుంగుల యొడళ్ళు, తుండములు నంటుచు వాని నడుమఁ దిరుగాడెను. ఆమె కరస్పర్శ గిలిగింతలు గొలిపి యా యేనుంగుల రోమములు నిక్కబొడిచి మేనులు జలదరించు చుండెను.

క్రమముగాఁ జౌదంతి యింద్రవర్మకు మచ్చికయయ్యెను. ఆయన దాని తుండమునుఁ జతుర్దంతములను నిమురుచు దానిని వశపఱచుకొనెను. ఒకనాఁ డింద్రాణి చౌదంతి తుండము నిమురుచుండఁగా నింద్రవర్మ దాని దంతముపై గాలూది చెంగున నెగిరి మూపుపైఁ గూర్చుండెను. ఇంద్రాణి తుండము వెంటఁ బ్రాకి కుంభస్థలమునఁ గూర్చుండెను. చౌదంతి మంద్ర మధురముగ గర్జించుచు నానందసుందర మందగమనమునఁ దన యనుచరవర్గములలోనికిఁ బోయెను. చౌదంతికి నేఁడెన్నఁడును లేని రాచఠీవి వచ్చినది. కడమ యేనుఁగులకుఁ గూడ నా ఠీవిపై మరులు పుట్టెనో యన్నట్లవి చౌదంతి యిరుపార్శ్వములను బిరుందను బారులు దీర్చి నడుపఁదొడఁగెను. చౌదంతికి దినమున నొక యలంకారమై కడమ యేనుఁగులకు దినమున కొక వింత యనుభవమై యాటవికములగు నా జంతువులు నానాఁటికి నాగరకము లగుచుండెను.

ఫాల్గుణమాసము ముగియవచ్చు చుండెను. ఇంద్రభట్టారకునకు జయావళి యునికి యంతుపట్టలేదు. ఇంద్రవర్మ మర

ణించెనను విశ్వాసము జయావళిమీఁది యాతని యాశలకుఁ బఁదిరి వెట్టినట్లయ్యెను. జయావళీ సౌందర్య గతచిత్తుఁడై యాతఁడు పురణి సంగమమునఁ గాలుకాలిన పిల్లివలె చిరాకు పడు చుండెను. జయావళి వత్సగుల్మమునం దుండెనని కొందఱు, కళ్యాణపురము నందుండెనని కొందఱు,నందివర్ధనమునం దుండెనని కొందఱు పోయిన చారులు వార్తలు తెచ్చుచుండిరి. ఈ వార్త లన్నియు వట్టి యూహలు. నిశ్చయమైన వార్తయొక్క టియు లేదు.

కొంగోడ సైన్యాభీతుఁడు మహేంద్రగిరికడ నింద్ర భట్టారకుని గలసికొన వచ్చినట్లు, కాలచూర్య ప్రితాపశీలుఁడు వత్సగుల్మమునఁ గదంబ రవివర్మను గలిసికొనఁ బోయెను. మహా కోసలముల భవదేవరణకేసరి కిప్పుడు కదల వీలయ్యెను. కాని అప్పుడే కదలవలదని యింద్రవర్మ యాయనకు సందేశ మంపెను. విజయకందళీ పురమున పృథ్వీమూలుఁ డెప్పుడెప్పు డాయని యాతురపడుచుండెను. ఆయనకుఁ గూడఁ గదలవల దని యిందివర్మ వర్తమాన మంపెను.

నగ్నశర్మ యీ లోగా నడపదడప నాలుగైదు పర్యా యము లిందిభట్టారకుని దర్శించి యాయన యంతరంగమును పడసెను. కళింగ రాజునకుఁ దోహా మాచరించిన శబరులపైఁ నిందివర్మ సైనికులు పగపట్టి శబర వాడలపై నాకస్మికముగా దాడులు చేయుచుండిరనియు, గూడెములఁ దగులఁబెట్టి, శబర

కన్యలకు మానభంగ మొనర్చుచుండిరనియు నగ్నిశర్మ యాయ నకుఁ జెప్పెను. ఆయన యనుమతిపై రెండుమూఁడు పర్యాయ ములు రెండేసివందల మంది యాత్రికులను మహాకాంతారముల లోనికిఁ దీసికొనిపోయి చెట్లకొమ్మలలో దాగియుండిన శబర ధానుష్కులచే వారిని మటుమాయము చేయించెను. గూడె ముల రతణకై వారి నడవులలో దాచియుంచితినని ఇంద్ర భట్టారకునకు నచ్చఁజెప్పెను. ఆయన చారులవల్లఁ జేరుచుం డిన వార్తలను తాను చల్లగాఁ బద్మనాభగిరికిఁ జేరవేయించు చుండెను. శబర వీరులను విష్ణుకుండిన సేనలలోఁ జేర్పించి యమ్మల ఱెక్కలలోఁ బొదివి దంతపురపుఁ గోటలోనికి వార్తల నెగురవేయించు చుండెను. ఈ బ్రాహ్మణ రాజవంశ మును బునఃప్రతిష్ఠ చేయవలెనను పట్టుదలతో నాయన మృత్యు కరాళ దంష్ట్రిలలోఁ దల దూర్చి పనిచేయుచుండెను.

గర్పడా కొండలెల్ల జెట్టులు ప్రాకినట్లుండెను. పుళింద సేనుని మందిరమున వానికిఁ గఠోరనిర్బంధమయ్యెను. పద్మ నాభగిరిపైఁ బెండ్లి సన్నాహములు జరుగుచుండెనని యగ్ని స్వామి వాని కాళలు పెట్టుచుండెను. వాఁడిందాత్రిణిని జూచి యప్పుడే నెలదినములు గావచ్చుచున్నది. చల్లనిమాటలతోఁ జిత్తమున కుపశాంతి గలిగించుట కగ్నిస్వామియు వానికిఁ బదునైదుదినములుగాఁ గంటికిఁ గానవచ్చుటలేదు. పుళిందసేనుఁ డెప్పుడేని కనఁబడినను బదుగురు వింతమానిసులతోఁ గనఁబడు

చుండెను. పలుకరించినచో నాయన యేమి కన్నుమనునోయని వాఁడు నోరు నొక్కుకొనుచుండెను.

అగ్నిస్వామి చదరంగపుఁ బలకపై పావులను గదలించు టకై స్వయముగా బయలుదేరెను. ఆయన తిన్నగా వాతాపి నగరమున కేగెను. రణరాగుని దర్శించెను. నగరమున సమర సన్నాహముల సందడి గమనించెను. "గాంగులు, చాళుక్యులు వాకాటకులకు రెండునేత్రములు. ఒక కన్ను మూసికొని నిద్ర పోవుచున్నది. ఇంకొక కన్ను తెఱచుకొనియే నిద్రపోవు చున్నది. శత్రువు బాహాటముగ సామ్రాజ్యము దోచికొని పోవుచున్నాఁడు." అగ్నిస్వామి యాడిన మాటలు రణరా గుఁడు చేయుచున్న యూహాలు నేకీభవించెను.

చైత్రారంభమునఁ బల్లవుఁడు గడికదలును. ఆ మీఁద పలకయంతయుఁ గదలును. జయావళి కళింగములకు రాలేదు. మహాకోసలములకుఁ బోలేదు. ఏ కోటయందోఁ జిక్కువడి యుండును. కళ్యాణపురమున నుండినచోఁ దాను చెఱవిడిపిం తునని రణరాగుఁడు మాట యిచ్చెను. కళ్యాణపురము కదంబుని గుప్పిటిలో నున్నది.

కొంగొడ మంత్రి యింద్రభట్టారకునితోఁ దనకు నడచిన సంభాషణమును సైన్యాభీతునకుఁ జెప్పెను. ఇంద్రభట్టార కుఁడు దనకు మొండిచేయి చూపఁదలచెనని సైన్యాభీతునకుఁ దెల్లమైపోయెను. కాలచూర్యునకుఁ గూడ నీతఁ డిట్లేచేయును.

సైన్యాభీతుఁడు ప్రతాపశీలునకుఁ గబురంపెను. అతఁడు వరదాఖండమునైనఁ గబళింపఁ జాలకపోదునా యని వత్స గుల్మమును ముట్టడించి కూర్చుండెను.

అగ్నిస్వామి చైత్ర పంచమినాఁడు పద్మనాభగిరిపైఁ బ్రభువును దర్శించి యిది యంతయు విన్నవించెను. పల్లవుఁడీ పాటికిఁ గదలియే యుండును.



# ౧౯

గర్సడాకు నిప్పులలోఁ బొరలు చున్నట్లుండెను. పుళింద సేనుని మందిరము మహానరకకూపమనిపించెను. ఇంద్రాణి కంటికగపడుచున్నచో నెట్టి నరకమునేని భరింప వచ్చును. ఇంద్రవర్మను జంపిన తనకీ నిర్బంధమేమిటి ? వానికిఁ గదలుటకు మెదలుటకు వీలులేకుండెను. పగలెల్ల పెద్దపులుల వంటి శబర భటులు వానికిఁ గావలియుందురు. రాత్రులందు మాత్రము కావలి బిగువు కొంత సడలింపఁబడును. గర్సడాకుఁ జీకటియన్నఁ జచ్చి నంత భయము. ప్రొద్దుక్రుంకినచో వాఁడు గడప గదలఁడు.

పంచమినాఁటి యర్ధరాత్రి. గవాక్షము నుండి వెలుపలికిఁ దొంగిచూచెను. అంతయుఁ గాఱు చీకటి. నేఁడీ చీకటియే మో క్రొత్తగా నున్నది. వాని మనస్సంతయు నింద్రాణి యావరించి యుండెను. వాని కన్నులనిండ ఇంద్రాణి రూపమునిండి యుండెను. బయటి చీకటిలో నింద్రాణియే యఁటము కొన్నట్లుండెను. వానికింక మనస్సు వశము కాలేదు. కాలుసేతులు వశముగాలేదు. ఇంద్రాణిమీది మోహము వాని కెన్నడు లేని ధైర్యమును గలిగించుచున్నది. ఇంద్రాణిలేని యీబ్రతుకీచీకటి కంటె భయంకరమైనది. వాఁడు విల్లమ్ములు చేతఁబట్టుకొని చల్లగా వెలుపలికి వచ్చెను. దూర దూరములఁ గాగడాలు మినుకు మినుకు మనుచుండెను. వాఁడా కాగడాలను దప్పించి

యద్దుతోఁవలఁ బద్మనాభగిరి దిక్కున బయలుదేరెను. ఇంతలో వానికిఁ జౌదంతి గుర్తునకు వచ్చెను. గుండె జల్లుమనెను. మరల వాని కింద్రాణి గుర్తునకు వచ్చెను. వాఁడు గుండె బిగ్గబట్టుకొనెను. ఇంద్రాణిని జూడని యీ బ్రతుకుకంటెఁ జావేమేలని వాఁడు తెగింపు చేసికొనెను. చరచర నడచి కొండమీఁదికిఁ బోయెను. ఆ యర్ధరాత్రిమున నింద్రాణి యెట్లగపడును? తెల్లవాఱినచో వానికొరకు భటులు దరుముకొనివత్తురు. తెల్లవాఱనిదే యింద్రాణి దర్శనముగాదు. వానికొక యూహ తట్టెను. కోవెల యెదుట వటవృక్షముపై దాగికొన్నచో భటులను దప్పించుకొనవచ్చును, చౌదంతికిఁ జిక్కకుండనువచ్చును. ఇంద్రాణిని గరవుదీరఁ జూచుకొనవచ్చును. వాడు చెట్టెక్కి చిటారుకొమ్మన గువ్వపిట్టవలె ముడుచుకొని కూర్చుండెను. వాని కెటుచూచినను వందలకొలఁది కరదీపికలు మినుకు మినుకు మనుచుఁ గానవచ్చెను. ఈ మహాకాంతారమున నేదేని మహానగరము వెలసినదా? వానికేమియు నర్థము కాలేదు.

తెలతెలవాఱుచుండఁ జెట్టుక్రిందఁ గలకలమయ్యెను. గర్సడా క్రిందికి జూచెను. తనకొఱకు భటులు రానేవచ్చిరి. గర్సడా యొడలెల్ల నాకులతో ముడుచుకొని కూర్చుండెను. ప్రభాతమగుసరికి వేణువనమునఁ జౌదంతి ఘీంకరించెను. "చౌదంతి, చౌదంతి" యనుచుఁ జెట్టుక్రింద భటులు పడమటి దిక్కులోనికిఁ బరువెత్తిపోయిరి.

పద్మనాభగిరి యుత్తర భాగమున వాసుకిబిలమని యొక గుహాయున్నది. పూర్వము నాగరాజా బిలద్వారమున నప్పుడప్పుడు మర్త్యలోకమున విహరింపవచ్చెడి వాఁడని ప్రతీతి. ఇప్పు డది చౌదంతి నివాసము. చౌదంతి ఇంద్రాణిని, ఇందర్రివర్మను వాసుకి బిలమున విడిది చేయించెను. ప్రతి దినమును ప్రభాత సమయమున నిరువురను బద్మనాభ దేవుని సేవకై తీసికొని వచ్చుచుండెను.

గర్సడా యాకుల మఱుగు నుండి తొంగిచూచెను. వ్యాఘ్రాసనమున గూర్చుండిన శబరరాజ్య పట్ట మహిషివలెఁ జౌదంతి మూపుపై నిందార్రిణి వాని కన్నులఁ బడెను. ఎన్నాళ్ల కెన్నాళ్ల కిందార్రిణి మధుర దర్శనము! వాని ప్రాణములన్నియు లేచి వచ్చి కన్నులలో నుండి యిందార్రిణి మీఁదికి దూకుచుండెను.

చౌదంతి చేరువ యగుచుండెను. గర్సడా వ్యాఘ్రాసన మనుకొన్నది వాని కన్నులలో మానిసి రూపుదాల్చుచుండెను. ఎవఁడీ మానిసి ? తన యింద్రాణి నొడిలోఁ బెట్టుకొని కులుకుచున్నాఁడు ! గర్సడాకుఁ గన్నులెఱ్ఱవడెను. అప్రయత్నముగ వాని దక్షిణహస్త మమ్ములపొదిమీఁదికిఁ బోయెను. విసపుటమ్ము వింటఁ దగుల్కొనెను. చౌదంతి మరింత చేరువయయ్యెను. ఇందర్రివర్మ చేతు లింద్రాణి నడుమునకుఁ జుట్టుకొనియుండెను. గర్సడా మనస్సు మధుకవృత్తు మూలమునకుఁ

బరువె_త్తెను. ఆ వృక్షమూలమున జుట్టుకొనినఁ పొడలపాము వాని కన్నులముందు మెరసెను. ఈ పురుషుఁడు కళింగరాజా ! గర్సడా కన్నులలో నిప్పురవ్వలు రేగెను. వాఁ డింద్రవర్మకంఠ మునకు గురివెట్టెను.

వటవృక్షము సమీపించుచున్న కొలందియుఁ జౌదంతికి విసపువాసన తగులుచుండెను. అది తుండమునె_త్తి పసికట్టు చుండెను. వటవృక్షమున దానికి శత్రువు పసితగిలెను. భీషణముగ గర్జించుచు నది తుండమె_త్తి వటవృక్షము దెస దూకెను. ఆ దూకున కింద్రాణి యులికిపడి ఇంద్రవర్మను గౌఁగిలించు కొని కిలకిల నవ్వెను. గర్సడా కన్నులు చెదరిపోయెను. వాని చేయి పట్టుదప్పి విసపుటమ్ము రివ్వున దూసికొనిపోయి చౌదంతి తుండమున గుచ్చుకొనెను. చౌదంతికిఁ బిచ్చియె_త్తినట్లయ్యెను. అది వటవృక్షమును బెరికివేయునంత సంరంభము చేయు చుండెను. గర్సడాకు ప్రాణము లెగిరిపోవుచుండెను.

ఇంద్రాణి కిదియేమో తెలియలేదు. ఆమె చౌదంతి తుండము నొడిసి పట్టుకొని "బాబా. బాబా" యని గోల పెట్టెను. తుండమున నాటిన యమ్మామె కంటఁ బడెను. ఆమె దానిని పెరికి చూచెను. అది గర్సడాదే! "వీడిచ్చటికెట్లు వచ్చెనని" యామె యిటు నటు బరికించెను. చెట్టుమీఁదినుండి గర్సడా విల్లు క్రిందఁబడెను. ఇంద్రాణి తలయె_త్తి చూచెను. చిటారు కొమ్మన గర్సడా గడ గడ లాడుచుండెను. వాఁడు

చెట్టు దిగువఱకుఁ జౌదంతి యూరకుండదు. దిగెనా వాఁడింక బ్రతుకుట కల్ల. ఇంద్రాణి చౌదంతి తుండమును కత్తి మూల మున నిరికించుకొని బలవంతముగాఁ గొండదిగువకుఁ దీసికొని పోయెను. గర్సడాపై నామెకుఁ గోపమును మించిన జాలి పుట్టుకొనివచ్చెను.

చౌదంతి చేత నిప్పటికిఁ దనకు చావుతప్పినది. కాని యీ సంగతి తెలిసినచోఁ బుళింద సేనుని చేతిలోఁ దనకుఁజావు తప్పదు. గర్సడా చెట్టుదిగివచ్చి బ్రతుకుజీవుడాయని యడవిలోఁ గలసిపోయెను.

పల్లవుఁడు కుంతలములపైఁ దండెత్తెనని దళమినాఁడు పురణి సంగమమున నింద్రభట్టారకునకును, గళ్యాణ పురమున రవివర్మకును వార్తలంపెను. ఇంద్రభట్టారకుఁడు రవివర్మను మూలబలములతోఁ గదలించి తాను మాత్ర మదనపుబలము లతో బయలు దేరెను. వేంగికింతటిలో భయములేదు. పోయినచోఁ గుంతలములే పోవును. రవివర్మ పాప మీవంచన యెఱుంగడు. వార్త విని యాయన హడలిపోయెను. వెంటనే కళ్యాణ పురదుర్గము ముట్టడియెత్తించెను. చాణక్యుల ప్రక్క పోటులు దట్టుకొనుచు మాల్యఖేట పర్వతములు దాటునప్పటికి రవివర్మకుఁ బ్రాణములు కడబట్టెను.

రవివర్మ ముట్టడి యెత్తివేయుటయు నొక యెత్తు కావచ్చునని కళ్యాణపురదుర్గ మొక దినమంతయుఁ దలుపులు

బిగించుకొనియే కూర్చుండెను. మఱునాఁడు చాళుక్య రణరా గుఁడువచ్చి తలుపులు దెరిపించెను. కళింగముల జరిగిన కథ యంతయు జయావళికిఁ దెలిపెను. ఆమె యాపాదమస్తకము వెన్నెలతీవ వలెఁ గంపించిపోయెను. మధువనమునఁ బోయి వాిలవలెనని తహతహలాడెను. రణరాగుఁడామె నూరడించి "కళ్యాణదుర్గమును నేను గాపాడుకొందును. నీవుపోయి కళింగ ములను గాపాడుకోవమ్మా" యనెను.

కాల్బలమును, గజబలమును హస్తిభోజున కప్పగించి జయావళి యైదువందల యాశ్వికులతోఁ దత్క్షణమే కళింగము లకుఁ బయనమయ్యెను.

నందివర్ధనపురము నుండి రణకేసరి మహేంద్రగిరిపై కెత్తి వచ్చుచుండెనని పురణి సంగమమునకు వార్తవచ్చెను. "సైన్యా ధీశుఁడు వానికిఁ దొలికబలమగును. ఆ కబళము వాని కంఠము దిగినప్పుడు చూతములెమ్ము" అని యింద్రభట్టారకుఁడను కొనెను. విజయ కందళీపురము నుండి పృథ్వీమూలుఁడు కదలె నని వార్త వచ్చెను. "అతడుమనకుఁ బ్రాణాహుతులకుఁజాలడు పొమ్ము" అని యిందిభట్టారకుఁ డనుకొనెను. జయావళి యాతని చిత్తమునకు మత్తెక్కించి యట్లనిపించుచుండెను. ఇంద్రవర్మ శబరయువకునిచేతఁ జచ్చెనన్న విశ్వాసము వాని చిత్తము నత్తుకొని యట్లనిపించుచుండెను. జయావళి దంతపుర ముననున్నచోఁ దనయెడిలో నున్నట్లే. కళ్యాణపురమున నున్నచో రవివర్మ యనెడు కనకపంజరమున నున్నట్లే.

రవివర్మ పంజరము భగ్నమయ్యెనని వార్త వచ్చెను. అయినచోఁ బిట్ట యెగిరి వచ్చుచున్నదన్నమాట! కళింగములకు వచ్చినచోఁ దన కౌగిటఁజిక్కకిం కెక్కడకుఁబోవును? ఇంద్రభట్టారకుఁడు పటకుటీరద్వారమున నొంటికాలిపై నిల్చుండి యా పిట్టకై యెదురు తెన్నులు చూచుచుండెను.

"హరిసేనుని జంపితిని. ఇంద్రవర్మ చచ్చెను. వాకాటకము, కళింగము నేకమయ్యెను. సకల దక్షిణాపథపతిని జయావళి చేరవచ్చుచున్నది." ఇంద్రభట్టారకుఁడీధ్యానమున మునిఁగి యుండగా బిట్టపిడుగువలె గర్సడా ఆయన ముందూడిపడెను.

ఇంద్రభట్టారకుని సమాధి యాకస్మికముభంగమయ్యెను. ఆయన "గర్సడా"యనఁబోయి"తమ్ముఁడా"యని వానిని సంబోధించి "ఏమి విశేషము? మరల నేమి శుభవార్త తెచ్చితివి?" అనెను.

"ప్రభువా? ప్రభువా? కొంప మునిగిపోయినది."

"ఏమయినది?"

"పుళిందసేనుఁడు నన్ను వంచించెను. నాయింద్రాణిని."

"ఏమి ఇంద్రాణిని నీకియ్యలేదా?"

"అయ్యో! ఇంకెక్కడి యింద్రాణి! ఆమె కళింగరాజు కౌఁగిటిలోఁ గులుకుచున్నది"

"ఆఁ! కళింగరాజా?"

"అవును ప్రభువా ?"

"కళింగరాజును నీవు చంపితివి గదా !"

"లేదు ప్రభు ! పుళిందసేనుఁడు నాచే నట్లు జొంకించెను."

"ఔరా ? పుళిందసేనుఁడు నన్నుగూడ వంచించెనా ?"

ఇంద్రభట్టారకుఁడు కోపోద్రేకమున నొంటికాలిపై గడగడ జంపించిపోయెను.

"ఇంద్రవర్మ బ్రతికియున్నది నిజమా !"

"బ్రతికి యుండుటయేకాదు ప్రభువా ! ఇంద్రాణితోఁ బెండ్లికొడుకువలె మధువనములఁజౌదంతిపై నూరేగుచున్నాఁడు'

"ఏమంటివి ! చౌదంతియా ?"

"అవును ప్రభువా ? చౌదంతి సుప్రతీకము"

ఇంద్రభట్టారకుని గుండెలు దడదడలాడెను. అయన యొంటికాలిపై నిలువలేక కుప్పగూలిపోవునట్లుండెను.

"గర్సడా ! ఇంద్రభట్టారకుఁడింద్రవర్మను జంపి జయావళిని జేపట్టును"

" ప్రభువా ? గర్సడా కళింగ రాజును జంపి యింద్రాణిని జేపట్టును."

ఇంద్రభట్టారకుఁడు కుముదము నధిరోహించెను. గర్సడా దానిని నడిపించెను.

మధువనమునఁ గళింగ సేనలు బెల బెల కదలెను. ఐదు వందల యేనుంగులు, ఏనుంగున కెనమండ్రు శబరధానుష్కులు; వేయి యశ్వములు అశ్వమునకొక్క యేకాంగవీరుఁడు, రెండు వేల కాల్బలము, ఒక్కొక్కఁ డొక్కొక్క చిరుతపులి, ఈ సేనా ముఖమున సుప్రతీకముపై నింద్రవర్మ, ఆయన యొడిలో నింద్రాణి. ఆ మేఘయూహాలఁబడి సుప్రతీకము కైలాసగిరి కదలినట్లు కదలెను. ఆ వెంట సేన యంతయు నడచెను.

వంశధార యివ్వల కళింగసేన, అవ్వల విష్ణుకుండిన సేన. ఇవ్వల సుప్రతీకము, అవ్వల కుముదము. నడమ వంశధార యిసుకతిన్నెలపైఁ జైత్రిమాసపు టెండలు కణకణలాడుచుండెను. సుప్రతీకము గగనగహ్వారము బూరటిల్ల ఘీంకారము గావించెను. కుముదమునకాంఘీంకారము పదియేండ్లనాఁటికథను స్మరణకుఁ దెచ్చెను. అది యదరియడుగు వెనుకకుఁ గదలించెను. గర్సడా దాని కుంభ స్థలముపై నంకుశముతో నొక్క పోటు పొడిచెను. అది భయంకరముగ గర్జించి చిందులుఁ ద్రొక్కెను. ఆ గర్జ సుప్రతీకముగు ర్తుపట్టెను. పదియేండ్లనాఁడు తనరాణిపై మరులుకొని తన దంతముల గ్రుమ్మ్రులుతిని కీచకవనముల నుండి నైరృతి దిక్కునకుఁ బరచిన యీ బడుగు నేఁడు తన కెదురు నడచుచున్నదా ! సుప్రతీకమునకు వీరావేశమెత్తెను. అది కణ కణలాడు వంశధార సైకతముల కడ్డముపడెను. ఇరువాగులుఁ దలపడెను. సమరము తుములమయ్యెను. సుప్రతీకము కుముదమును, ఇంద్రవర్మ యింద్రభట్టారకుని గలిసికొనవలెనని తహ

తహాలాడిరి. కైలాసగిరి శృంగమువలె నాయెండలోఁ దళతళ మెరియుచున్న సుప్రతీక మిందర్రిభట్టారకుని కన్నులను జగేలు మనిపించెను. ఇంద్రాణి మేని నీలపుఁ దళ త్తళలు గర్సడా కన్నులకుఁ జీకట్లు కొలుపుచుండెను.

సుప్రతీకము కుముదము చతుర్దంతములలోఁ దన చతుర్దంతము శిరికించి పెళ్ళున విఱిచెను. తుండమునఁదుండము పట్టి ముంగాళ్ళపై మొగ్గతిల్ల నీడ్చెను. గర్సడా నేలకురికి వింటవిసపుటమ్ము సంధించెను.

జయావళి తన యాశ్వికదళముతో నాకసమున నెగిరి వచ్చుచుండెను. ఇంద్రభట్టారకుడు విరిగిన ధైర్యము నతుకు పెట్టుకొని కుముదముమీఁదినుండి యశ్వముమీఁదికురికి జయావళి నెదుర్కొనఁబోయెను. సుప్రతీకము కుముదము మేను నేలపైఁ బొరలించి దాని కుంభస్థలముపై ముంగాళ్ళూది విజయ గర్జ గావించెను. గర్సడావిసపుటమ్ము కళింగరాజు బొమ్మలకు గురి యమరెను. సుప్రతీకము వానిమీఁదికి దూకెను. విసపుటమ్ము రివ్వునబోయి యింద్రాణి ఫాలమును భేదించెను. ఆమె కెవ్వున అరచి ఇంద్రవర్మ యొడిలోఁ బడిపోయెను. ఇంద్రాణి యఱపు సుప్రతీకము మాడుపైఁ జఱచెను. దానికిఁ బిచ్చియెత్తినట్లయ్యెను. అది సుడిగాలివలె చెలరేగెను. గర్సడా శరీరమునుఁ జితుకఁద్రొక్కుచు సేన యంతయుఁ గలయఁదిరిగెను.

విష్ణుకుండిన సేవ లింటిమొగము పట్టెను. కళింగసేన లవ్వానిని వెన్నంటి గోదావరిలో గలిపివచ్చెను.

సుప్రతీకమునకుఁ బిచ్చియెత్తెను. అది యింద్రాణి శరీరమును తుండాగ్రమున గ్రహించి మధువనములలోని కెగఁబడెను. మధువన మంతయు మధించి మధించి పద్మనాభగిరి శిఖరముపై నిలిచెను. ఇంద్రవర్మ బొమ్మవలె దాని మూపున నల్లె కూర్చుంచుడెను.

చౌదంతి యింద్రాణి శరీరమునుఁ గన్నులలోఁ బెట్టి చూచుకొనెను. నెత్తిపై బెట్టి మోచుకొనెను. తుండముతోఁ బట్టి యూచుకొనెను. వేదనతో గీచకవనమంతయు చెదిరిపోవ నఱచెను. అఱచి యఱచి యింద్రాణి శరీరమును దుండాగ్రమునఁ బట్టి గిరగిరఁ ద్రిప్పి తూర్పు దిక్కుగా లోయలోనికి విసరివైచెను. ఆ శరీరము పోయి లోయలో జలజల ప్రవహించు వంశధారా స్రవంతిలోఁ బడెను.

వంశధార పద్మనాభగిరి పార్శ్వమున వంపులు దిరుగుచు నిప్పపూల తెప్పలపై నింద్రాణినిఁ బొదువుకొనుచు నొయ్యారముగ సాగిపోవుచుండెను.

మధువనమున వసంతము వికసించెను. వంశధారపైఁ బూలపల్లకి నెక్కి యూరేగు నింద్రాణి కడవియంతయుఁ బుష్పాంజలు లర్పించెను. సుప్రతీక మింద్రవర్మ నెక్కించుకొని వంశధార వెంట నింద్రాణి యంతిమ యాత్ర చేయించుచుండెను.

అది ముఖలింగము. అది చక్రతీర్థమున సుడులు తిరిగి వంశ ధారలో నంతర్లీనమయ్యెను.

ఇంద్రవర్మ కన్నులనుండి యశ్రుబిందువులు చిందు కొనుచు వంశాధార యొడ్డునున్న జీలుగుచెట్టు వంకఁ దిలకిం చెను. ఆ కొమ్మపైఁ గేలూది జయావళి యాయనకుఁ బ్రత్యక్ష మయ్యెను.

వైశాఖ బహుళ పంచమి. ముఖలింగదేవుని మందిర ప్రాంగణమున సుప్రతీకము నందీశ్వరునివలె నాలుగు గాళ్ళపై మోకరిల్లి యుండెను. దాని దక్షిణదంతద్వయము నూఁది యింద్రవర్మయు వామదంతద్వయమునూదిఁ జయావళియు నిల్చియుండిరి. హస్తిభోజ శాంతివర్మ లొకవంక, పుళిందసేన పృధ్వీమూలు లొకవంక నిల్చియుండిరి. సామంతులు, దండ నాధులు, రాజపుత్రులు, అంతరింగులు, కుమారామాత్యులు, విషయపతులు, ఉపరికులు, ఆయుక్తకులు, దండపాశికులు. స్థానాంతరికులు, చాటులు, భటులు చుట్టును బలిసియుండిరి.

అగ్నిస్వామియు, నగ్నశర్మయు ముఖలింగదేవర కభి షేక మొనరించి యనంతర మా పవిత్రజలములతో నింద్ర వర్మను జయావళిని అభిషేకించిరి.

సుప్రతీకము తుండమెత్తి మంగళతూర్యము లొత్తెను. ఆ తూర్యములలో మేళవించి యగ్నిస్వామి యింద్రవర్మ ప్రశస్తి పఠించెను. "గంగామలకుల గగనతల సహస్రరశ్మి ! జయ ! !

మిత్రవర్మ మహారాజ ప్రియసూనూ ! జయ !! మాతాపితృ పాదానుధ్యాతా ! జయ !! అనేక చతుర్దంత సమరవిజయా! జయ !! అతులబల సముదయావాప్త విపుల సుహృత్సాధు బాంధవార్థిజనా ! జయ !! విమల వికోశ నిస్త్రింశధారాసమాక్రాంత సకల సామంత నృపతిమండలాధిపతి మకుట నిహిత రుచిర పద్మరాగ ప్రభాప్రసేక పరిష్వంగ ! త్రికళింగాధిపతీ ! ఇంద్రాధి రాజా ! జయీభవ ! ! దిగ్విజయీభవ !!! మధువనములఁ బుట్టి మహాకాంతారములఁ బట్టి, మహోదధి తీరములు మెట్టి, త్రికళింగములుఁ జుట్టిన యా పశ్రిస్తి యందలి ప్రత్యుతరమునను పభ్రువునకు ఇంద్రాణియే పత్ర్యుతమగుచుండెను.

ఓమ్ తత్సత్

